# దొర * ఏడు సున్నలు



పోతుకూచి సాంబశివరావు

# దొర - ఏడు సున్నలు

## ( నాటికలు )



రచన:

పోతుకూచి సాంబశివరావు.



ఆంధ్ర విశ్వ సాహితి

సికింద్రాబాదు

ప్రథమ ముద్రణ :

1000 కాపీలు.

1st సెప్టెంబరు 1960.



వెల : ఒకరూపాయి

ముఖచిత్రం :

వి. ఆర్. రాజు

ప్రతులకు :

ఆంధ్ర విశ్వసాహితి,

208, బోయిగూడ, సికింద్రాబాదు.

ముద్రణ :

నాగార్జున ప్రింటింగ్ వర్క్సు, హైదరాబాదు.

## నేననేది

ఈ పుస్తకంలోని నాటికలు రెండూ ప్రదర్శనలద్వారా మన్ననలందుకున్నాయి. నవ్యసాహితీ సమితి నాటక శాఖవారు "దొర" ప్రథమంగా ప్రదర్శించారు; ఆంధ్రప్రభ వారపత్రిక ప్రచురించింది. "ఏడుసున్నలు" ప్రథమంగా మిత్రుడు శ్రీ చివుకుల గోపాలకృష్ణ ప్రోత్సాహంవల్ల వ్రాయబడి, నిజాం కాలేజిలో ప్రదర్శించబడింది; దేశోద్ధారక గ్రంధమాలవారు ప్రచురించారు. ఈ నాటికల ప్రచురణ, ప్రదర్శనలలో సహకారము, ఆదరణ, చూపించిన మిత్రులందరికి కృతజ్ఞతలు.

నాటికల ప్రయోజనం, ప్రసిద్ధి, నటులు, నాటక సంస్థలు, నిర్ణయించాలి. రచన నాటకరంగానికి అందివ్వడంవరకే రచయిత బాధ్యత ఈ పుస్తకంద్వారా నా బాధ్యత సఫలీకృతం కాగలదని విశ్వసిస్తున్నా.

పోతుకూచి

# పాత్రలు

1. సుధాకర్
2. శోభనాచలం
3. మంగమ్మ
4. అప్పన్న
5. సత్తెయ్య
6. సింగన్న
7. డ్రైవరు

# దొర

(రావిచెట్టు—చుట్టూ గచ్చుతిన్నె — అక్కడక్కడ ఎండిన ఆకులు రాలిపడి వుంటాయి. గచ్చుతిన్నె రోడ్డు దుమ్ముతోకూడి పాలిపోయిన ఎర్రరంగులో వుంటుంది.

ఏభయయేళ్ళ వయస్సులో సూటు, హేటు ధరించి, చేతిలో షోకుగా కర్ర వూపుతూ, సిగరెట్టు కాలుస్తూ ప్రవేశిస్తాడు సుధాకర్. తిన్నెమీద దుమ్ము దులుపుకుని చికాకుగా కూర్చుంటాడు. చేతిలో పూలదండ వుంటుంది.)

డ్రైవరు : (ప్రవేశించి) దొరా !

సుధాకర్ : (చికాకుగా) ఏం ?

డ్రై : ఇంకో గంట ఆలస్యమవుతుంది. కారు ఇంజన్ చెడిపోయింది. మరమ్మత్తు చెయ్యాలి దొరా !

సు : (కోపంగా) ఇంత అజాగ్రత్తగా వుంటే ఎలా ? ఇంటి దగ్గర బయలుదేరేముందు కారు ఎలావుందో చూసుకోకూడదూ !

డ్రై : (నవ్వుతూ) పొరపాటయింది దొరా ! త్వరలోనే మరమ్మత్తు చేస్తా.

(నిష్క్రమణ).

సు : (డ్రైవరువైపు చురచుర చూస్తాడు) అతి మంచిగా చనువుగా వుంటే మనుష్యుల విలువలు అర్థం చేసుకోరు. ఎక్కడ కారు ఆగకూడదనుకున్నానో అక్కడే కారు ఆగిపోయింది. (పళ్లు కొరుకుతాడు).

1

(శోభనాచలం నిర్వికారంగా, నిర్లక్ష్యంగా ఓడీ కాలుస్తూ ప్రవేశిస్తాడు. భుజంమీది తువ్వాలుతో తిన్నె దులుపుకుని కూర్చుంటాడు. పంచ—చొక్కా దుస్తులు. అతన్ని చూసి సుధాకర్ నల్ల కళ్ళజోడు ధరిస్తాడు )

శోభనాచలం : టైమెంతయింది బాబు !

సుధాకర్ : అయిదు గంటలు.

శో : అంటే సంధ్యాసమయం అవుతోందన్నమాట. (నవ్వి) అస్తమయానికి దగ్గరగా వస్తున్న నా బ్రతుకులాగే ఈ దినంకూడ ఆఖరవుతోందన్నమాట !—తమ దేవూరు ?

సు : మదాసు.

శో : పట్నంలోని దొరలా ! టోపీ పెట్టుకుని సూటు వేసుకున్న ప్రతీవాడు దొరలాగే కనిపిస్తాడు. పట్నంలో మసిలితే దొరతనం మరీ ఇనుమడిస్తుంది. బాహ్యమైన దొరవేషంలో దాగొన్న కుత్సిత హృదయాలు పరిశీలించడం కష్టం. పల్లెటూరి మోటుమనుష్యుల మాటలో దాగొన్న నిర్మల వుదాత్త త్యాగ హృదయాలుకూడ ఎవరూ అన్వేషించలేరు. (ప్రశాంతంగా నవ్వుతాడు).

సు : జీవితాన్ని తరిచి అర్థం చేసుకున్న జ్ఞానవృద్ధుల్లా వున్నారు.

శో : దొరలాంటి మనుష్యులు నవ్వుతూనే జీవితాన్ని దోపిడి చేస్తారు. మనస్సులోవున్న మోసం మాలిన్యానికి నాగరికత నాజూకు నవ్వు ఒక మెరుపుపూత. నా జీవితం తరిచి అర్థం చేసుకున్న జ్ఞానం ఇది.

సు : ఇప్పుడేం చేస్తున్నారు మీరు ఈ వూళ్లో ?

శో : స్వేచ్ఛగా బ్రతుకుతున్నాను. నా బ్రతుకులో చాల భాగం బానిసత్వంలోనే గడిచిపోయింది. పొట్టకోసం అధికారుల ఆజ్ఞలలో ఒదిగి వ్యక్తిత్వం, తెలివి చంపుకున్నాను. నిజంగా చనిపోయే ముందయినా స్వేచ్ఛగా బ్రతికి, తెలివిగా ఆలోచించి వ్యక్తిత్వం నిలబెట్టుకోవాలనుకుంటున్నాను. ఈ రావిచెట్టు —— చల్లగాలి——వూరు బయలు——దూరాన పచ్చిక పొలాలు—అనంతమైన నిర్మల ఆకాశం—— స్వేచ్ఛగా విహరించే పక్షులు—చూస్తుంటే ఎంత హాయిగా వుంటుంది? గడిచిన బానిసత్వ జీవితం—గడుస్తున్న బంధాల జీవితం—ఈ రెంటింటి బాధలు మర్చిపోతా!——ఇదే నా ఉద్యోగం!!

సు : మీ పేరు?

శో : శోభనాచలం.

సు : అ——(ఆశ్చర్యపోయి మౌనంగా ఆలోచనలో పడుతాడు.) శో——భ——నా——చ——లం!!

శో : పేరు బాగులేదా?—— జీవితం బాగుండాలి కాని పేరు బాగుంటేనేం! లేకపోతేనేం?——ఈ వూరికి పనిమీద వచ్చారా!!

సు : లేదండి—రాజమండ్రి వెడుతున్నా—కారు ఇంజను చెడిపోయింది.—అందుచేత కాస్సేపు ఇక్కడ కూర్చున్నాను.

శో : కారు ఎందుకు చెడిపోయింది?

సు : డ్రైవరు అజాగ్రత్తవల్ల!

శో : వాడికి జుల్మానా విధించండి ఇంటికి వెళ్ళగానే!

సు : (నవ్వుతూ) అంతే చెయ్యాలి.

శో : మీ డ్రైవరుకు జీతం ఎంత ఇస్తారు?

సు : ముప్పయి రూపాయలు.

శో : అతనికి భార్యా పిల్లలుకూడా వున్నారనుకుంటా.

సు : ఆ! ఏదో సంసారం వుంది.

శో : (వ్యంగ్యంగా) ఒక కాలం నియమం లేక అవసరం వచ్చి నప్పుడల్లా వుపయోగించుకుని, ఆర్థిక పతనంతో సంసారంలో అవస్థలు పడే సేవకుల స్థితిగతులు దొరలా బ్రతికే యజమానికి అవసరంలేదు. —తప్పకుండా జుల్మానా విధించండి మీ డ్రైవరుకు ! !

సు : మీరు అలాఅంటేనే, నేను "ఊ" అన్నా.... లేకపోతే,

శో : లేకపోతే జుల్మానా వెయ్యడమే కాకుండా కారు మరమ్మత్తు ఖర్చులుకూడా అతన్ని భరించమనేవారు కదూ !

సు : మీరు విచిత్రంగా మాట్లాడుతున్నారే !.... మునుపు మీ రేం ఉద్యోగం చేశారో చెప్పారు కాదు.

శో : అయితే వినండి. బీద కుటుంబంలో పుట్టాను. ఎక్కువ చదువుకోలేక పోయాను. కుటుంబ ఆచారం ప్రకారం చిన్నతనంలోనే భార్యను నా జీవితంలో యిరికించారు నా తల్లితండ్రులు. పట్నంలో ఒక కంట్రాక్టరు దగ్గర గుమాస్తాగా కుదిరేను. చాలని జీతం. పెరుగుతున్న సంసారం. ఆర్థిక చిక్కులతో అల్లాడిపోయాను. ఎదిగే పిల్లలకు జీవితంలో సరైన అవకాశాలు కలిగించలేకపోయానని మమతలతో బాధపడ్డాను. ఉద్యోగసేవలో జీవితమంతా ధారపోశాను. పొట్ట కోసం ఉద్యోగం అంటిపెట్టుకునే నా హీనస్థితిని చూసి తియ్యని చిరునవ్వుతో, కటువైన ఆజ్ఞలతో రాత్రింపగళ్లు యజమాని నాచేత చాకిరీ చేయించుకున్నాడు. నా కాయకష్టంవల్ల వచ్చిన లాభాలు

దోచుకున్నాడు. ముప్పయి యేండ్ల జీవితం ఉద్యోగంలో గడిపితే, వార్ధక్యంలో, ఎముకల పోగులా, నిర్జీవ ప్రతిమలా, బరువెక్కిన మునిమనుమల సంసారంతో, మునుపటికన్న హీనమైన ఆర్థిక స్థితిలో ఉండిపోయాను. బానిసగా బ్రతికి ఏం సాధించాను ? స్వేచ్ఛగా బ్రతికితే యజమానిని మించినవాణ్ణి కాగల్గుదునేమో !

సు : మీ పొట్టకోసం మీరు ఉద్యోగం చేశారు !.... అందులో యజమాని తప్పేముంది ?

శో : అవును. పొట్టకోసం జీవితంలో తప్పటడుగు వేశాను. నా తప్పటడుగులోని నా అశక్తి గుర్తించి నా జీవితం దోపిడి చేశాడు యజమాని.... పరిమితమైన బానిస బ్రతుకులో మనస్సులోని ప్రతీ భావం, హృదయంలోని ప్రతీకోరికను చంపుకున్నాను. ఇప్పుడు నా యజమాని కనిపిస్తే.........

సు : కనిపిస్తే.

శో : మాట్లాడుతాను. ఇష్టంవచ్చినట్లు మాట్లాడగలను. స్వేచ్ఛగా సమాన హోదాతో నిలబడతాను. నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తాను. అతని జీవితంలోని నీచత్వం అంతా వెలిగ్రక్కుతాను నిర్భయంగా.

సు : మీ యజమాని పేరు ?

శో : సుధాకర్ !.... నీచుడు ! విశ్వాసహీనుడు ! ముప్పయ్యేళ్ళ ఉద్యోగసేవ తృటిలో మర్చిపోయాడు. వార్ధక్యం వచ్చిన శరీరం అతనికి లాభం కలిగించే చాకిరీ చెయ్యలేదని ఉద్యోగం మానెయ్యమన్నాడు. దొంగల్లా దోచుకొనే 'దొరలకు సేవకుల బీద బ్రతుకుల బాధల సంగతి అక్కర్లేదు.

సు : (చికాకుగా, కోపంగా) డ్రైవరు!.... డ్రైవరు!

శో : క్షమించండి. ఏదో అనేస్తున్నాను. మనిషి బాధలో ఉన్నప్పుడు బయటికి మాటలు రాకపోతే హృదయభారం తగ్గదు.

సు : ఆ....ఏమీలేదండి.... మీరు ఎన్నాళ్ళయింది ఉద్యోగం మానేసి.

శో : మూడేళ్ళ క్రితం....అప్పటినుంచి యీ పల్లెటూరు వచ్చేశాను. బీదవాళ్లు పట్నాల్లో బ్రతకలేరు కదండి!.... ఇంతకీ మీ పేరేమిటో చెప్పారు కాదు!!

సు : సుధా....(కంగారుగా)....నా పేరు....వినాయక్!

శో : అబద్ధం చెబుతున్నారా?

సు : లేదు....ఇది నా నిజంపేరు.

శో : పోనీ అబద్ధం చెప్పండి....దొరలాంటి మనిషి, ఎన్ని అబద్దాలు చెప్పినా తన టోపీ అడుగున దాచుకోగలడు. మా యజమాని కూడా ఎంతో నేర్పుతో అబద్దాలు ఆడగలిగేవాడు....కాని యీ విశాలమైన ప్రకృతిలోంచి ఎప్పటికైనా విలయతాండవం చేస్తూ పవనం విసురుగా వస్తుంది....అప్పుడు టోపీలు తల్లకిందులౌతాయి.

సు : నేను సుధాకర్‌ను కానండి!

శో : మీరు అవునో కాదో నిర్ణయించే శక్తి నా కంటికి, చెవికి లేదు. కాని మీరు కాస్సేపు సుధాకర్ అని ఊహిస్తాను.

సు : (గాభరాగా టోపీ తీసుకుని ఒంటిమీది చెమటలు విసురుకుంటాడు.)

శో : సుధాకర్! మనిషికి స్వార్థంలో కూడ పరిమితి ఉండాలి. ముప్ఫయేండ్ల జీవితం మీ కంపెనీ సేవలో ధారపోస్తే, నా కాయకష్టం వల్ల వచ్చిన ధనంతో నీ కుటుంబ హోదా, ఐశ్వర్యం నిలబెడితే ఒక్క తృటిలో అంతా మరిచి, నన్ను కంపెనీలోంచి గెంటేశావు. నీ జీవితం అభివృద్ధికి పాటుపడి నాశనమయిన నా జీవితంగురించి ఎప్పుడైనా ఆలోచించావా? ఇప్పుడు నేను నీ సేవకుణ్ణి కాదు....నాకు పూర్తి స్వేచ్ఛ ఉంది....నువ్వొక ద్రోహివి. నాజూకు నవ్వుతో జీవితాలు నాశనంచేసే నీచుడివి! దొరరూపంలోని దొంగవు!!!

సు : మీరు పొరబడుతున్నారు. నేను సుధాకర్ కాదని ఇంతకు ముందే చెప్పాను.

శో : క్షమించండి. సుధాకర్ కనిపిస్తే యిలా అనాలని అనుకుంటున్నా చాలాకాలంనుంచి....(ప్రశాంతంగా నవ్వి)....మీ ఉద్యోగం?

సు : వ్యాపారం.

శో : మీరూ యజమానులే! మీదగ్గర పనిచేసే బీద ఉద్యోగులను కనికరంతో చూడండి....లేకపోతే నాలోనివిప్లవ భావాలే వారికీ కల్గుతాయి.

సు : అలానే లెండి!

శో : పాపం! మీ కారు యింకా ఎంతసేపటికి బాగవుతుందో!....యీ రాత్రి మా యింట్లో భోంచెయ్యండి రేపు వెడుదురుగాని మీ వూరు.

సు : (నవ్వుతూ)! నేనే సుధాకర్‌బాబు నయితే మీ రిలా అతిథ్యానికి పిలుస్తారా?

శో : వ్యక్తుల హోదాలు, విభేదాలు స్నేహాన్ని, మర్యాదలను కలుషితం చెయ్యవు నా దృష్టిలో. నువ్వే సుధాకర్‌వి అయినా నా ఆతిథ్యం నీ కెప్పుడూ ఉంది. కాని నీమీద నా ఆగ్రహం మాత్రం మారదు! వెడతా!

సు : అప్పుడే వెడతారా? కాస్సేపు కూర్చోండి.

శో : చీకటిపడితే నాకు చూపు ఆనదు. పగలే దూరంగా ఉన్న వస్తువుల్ని ఆనవాలు పట్టడం కష్టం. పైగా యీమధ్య గంపెడు జబ్బు చేసింది. ఉద్యోగం మానేసిన మూడేళ్ళనుంచి బాధతో, బెంగతో మరీ పాడైపోయాను....నన్ను గుర్తుపట్టడమే చాలా కష్టం అంటున్నారంతా!.... ఏంచేస్తా చెప్పండి? ముసలితనం!.... మరి సెలవా! (నిష్క్రమణ నిర్విచారంగా, నిర్లక్ష్యంగా).

సు : మీ యిష్టం.... ఇంకా నయం. పొరపాటున పూర్తిపేరు చెప్పానుకాదు. స్వేచ్ఛ వచ్చిన యీ జీవ గుమాస్తా నామీద తిట్లతో స్వారి చేసేవాడు.

(మంగమ్మ కోళ్ళగంప నెత్తిన పెట్టుకుని, ఒక చేత్తో అరటి పండు తింటూ ప్రవేశిస్తుంది. గంప దింపుకుని కూర్చుంటుంది. ప్రక్కనేవున్న సుధాకర్‌వైపు పరీక్షించి చూచి నవ్వుకుంటుంది.)

మంగమ్మ : మన దేవూరు దొరా?

సు : పట్నం.

మం : నీ టోపీ బాగుంది దొరా!

సు : (నవ్వుతాడు.)

మం : టోపీలు పెట్టుకునే అలవాటున్న దొరలు మనుషుల్ని టోపీ వేస్తారు కదు దొరా!

సు : ఏమిటి? (చికాకుగా చూస్తాడు.)

మం : కోపం వచ్చిందా?.... అరటిపండు తింటావా? దొరా.... (గంపలోంచి పండు యిస్తుంది.)

సు : ఉహు. తినను.

మం : మాబోటి తక్కువవాళ్లు యిస్తే తినకూడదా?

సు : అబ్బే....(నవ్వుతూ తీసుకుంటాడు పండు)........పండు తియ్యగా ఉంది.

మం : ఈవూరి పళ్లే అంత!....ఇదేంటి దొరా? పూలదండ!!

సు : కావాలా?

మం : ఎక్కడిది?

సు : మీ పక్క గ్రామంలో ఒక సభ జరిగింది. నన్నాహ్వానించారు. అక్కడ జరిగిన గౌరవం యీ దండ.

మం : మల్లెపూలు! (దండ ముట్టుకుని వాసన చూస్తుంది.... కిలకిల నవ్వుతుంది.)

సు : మల్లెపూలు మత్తెక్కిస్తాయి కదూ!! (దగ్గరగా వస్తాడు)

మం : ఏంటి దొరా మాటాడుతున్నావు!.... దూరంగా ఉండు.

సు : ఉ!....ఫరవాలేదు....దండ తీసుకో.

మం : అరటిపండు యిచ్చినందుకు బహుమతా?

సు : కాదు.........ఊరికే.

మం : నీ దండ ఈ కోడి మెళ్లో వెయ్యి (గంపలోంచి కోడిని తీస్తుంది.)

సు : వెయ్యనా !....(కులుకుతూ దండవేసి. మంగమ్మ చేతులు ముట్టుకుని ఆనందిస్తాడు.)

మం : పైకి దొరవేషం !.... అన్నీ దొంగబుద్ధులు తు !

సు : నాకా ?

మం : నీకే....(నవ్వుతూ) నీక్కాదు.... సరిగా నీకే ... ఏం దొంగ దొరా !... నీపేరు ?

సు : (కంగారుగా) నాపేరు....నాపే....రు.... రమాకాంత్ !

మం : అలా కంగారు పడతావెందుకూ ?.... అబద్ధం పేరా ?

సు : కాదు. నిజం.

మం : నిన్ను చూస్తోంటే ఎవరో జ్ఞాపకం వస్తున్నారు దొరా !.

సు : ఎవరు ?

మం : (ఆలోచనగా)....సుధాకర్ బాబు.

సు : ఆ ! (సర్దుకుని) .. ఉహు, అలాగా !

మం : ఇరవై యేళ్ళ క్రితం చూశాను.... కొంచెం నీలాగే ఉంటాడు. కాని చాలసన్నగా ఉండేవాడు బాబు !....ఉత్తి దొంగ ! నమ్మినమనిషికి ద్రోహం చేశాడు. కాని ఒకప్పటి జ్ఞాపకాలు మాత్రం ఉండిపోతాయి తలలో !

సు : నీపేరు ?

మం : మంగమ్మ.

సు : మం....గమ్మ ! (క్రొత్తగా యుక్తి తట్టినట్లు)....నాపేరు సుధాకర్ మంగమ్మా! (నల్ల కళ్ళజోడు తీసేస్తాడు.)

మం : ఛ ! అబద్ద మాడతావెందుకూ ?....నీపేరు రమాకాంత్ !

సు : ఉ....నాపేరు....ఇలా వచ్చావేం ?

మం : మా యీరిగాడు వచ్చేవేళయింది. ఇద్దరం కలిసి గుడిసెకు పోతాం.

సు : పిల్లలా ?

మం : ముగ్గురు !

సు : ఎక్కడినుంచి వస్తున్నావు ?

మం : పరిక్క ఊరు వెళ్ళా!....కోడిగుడ్లిప్లు యీవేళ ఏపీ అమ్మకం పోలేదు

సు : ఈ అయిదు రూపాయలు తీసుకో.

మం : (తీసుకుంటూ) ఎందుకూ ?

సు : ఏమిటో యివ్వబుద్ధి పుట్టింది

మం : (నవ్వుతూ) ఆకారు నీదేనా ?....నీ కారులో ఎక్కించుకుంటావా బాబా ?

సు : నాతో వస్తావా పట్నం ?

మం : వో !

సు : మం....గ....మ్మ ! (ఆనందంగా దగ్గరగా వస్తాడు)

మం : (కోపంగా) దగ్గరికి వస్తే కోడిని విసిరేస్తా నీమీద.

సు : ఆ.... అవును. (నములుతాడు)

మం : అవునయ్యా ! నీలాంటి దొరలు దొంగలు ! ! మా సుధాకర్‌బాబు జ్ఞాపకం వస్తాడు. ఇక్కడే యీ తిన్నెమీదే ఒకరోజు అరటి పండు పెట్టా....స్నేహం పెరిగింది. తర్వాత పెళ్లి చేసుకుంటా నన్నాడు.... మోసం చేశాడు.... సుధాకర్‌బాబుకంటె మా యీరిగాడు నయం....నిజాయితీ, మంచిమనసు వాడి కుంది. కాని సుధాకర్‌బాబు జ్ఞాపకం వస్తూనే వుంటాడు.... అందుకే యీ తిన్నె దగ్గరకు వస్తూంటా.

సు : మరి—మంగ....మ్మా !.... (బాధగా దగ్గరికి వస్తాడు.)

మం : ఛ ! దూరంగా ఉండు....మంచీ మర్యాద లేదు.

ఆ !.... అదిగో యీరిగాడు వస్తున్నాడు.... వస్తాను ! (నవ్వుతుంది.)

సు : మం....గ....మ్మ ! (బ్రతిమాలుతున్నట్టు)....మంగమ్మా !

మం : (గట్టిగా నవ్వుతుంది ...వెకిలిగా నవ్వుతుంది) దొరా!.... దొరా !.... నీ అయిదు రూపాయలు దొంగిలించానని బాధపడుతున్నావా! ....నీలాంటి దొంగ దొరలను యిలాగే మోసం చెయ్యాలి ... యీ రాత్రి నాయీరిగాడికి, పిల్లలకు గంజి పొయ్యొద్దూ ! దొరా!.... దొంగ దొరా ! ....(వెకిలిగా నవ్వుతుంది) యీ అయిదు రూపాయలు నా యీరిగాడికి, పిల్లలకు ! ఈ నూలదండ నా కోడికి, దొరా !....దొంగ దొర !.... (వెకిలిగా నవ్వి, గంప నెత్తిన పెట్టుకుని వయ్యారంగా పోతుంది.)

సు : మంగమ్మ!...ఎంత మారిపోయింది.... అవును ఆ రోజులు ....చాలా సరదాగా గడిచాయి—ఇంట్లోంచి దొంగిలించి, వెన్నమీగడ తెచ్చిపెట్టేది.... అమ్మవారి గుళ్లో గన్నేరు చెట్లకింద రాలిన పువ్వుల మీద సంజె చీకటుల్లో....కమ్మని నిట్టూర్పులతో....హు....జ్ఞాపకం తెచ్చుకోకూడదు....కాని బ్రతుకుల హోదాలే వేరు! ఎలా కలియగలం జీవితంలో! కలిస్తే, యీ గ్రామంలో యీ మూలే ఒక పెద్దగా ఉండి పోయే వాణ్ణి!!.... ఎంత అందంగా ఉండేది మంగమ్మ. వయస్సు మళ్ళినా అందం ఎక్కడికి పోతుంది?....హు! అన్నీ మర్చిపోవాలి.

(అప్పన్న....కాకీ నిక్కరు—కాషాయరంగు బనీను, బుజంమీద తువ్వాలు, చేతిలో తోలుకర్ర. నూనెలేక రేగిన జుట్టు, అమాయకమైన ముఖం ...ప్రవేశం!)

అప్పన్న : బాబూ! జట్కా కావాలా?

సు : అక్కర్లేదు.

అప్పన్న : ఆ కారు మీదేనా?....చెడిపోయిందా?

సు : (ముభావంగా) ఉ.

అప్పన్న : నేను సాయం చెయ్యనా మీ డ్రైవరుకు?

సు : మరమత్తు చెయ్యడం తెలుసా?

అ : నేర్చుకున్నాను బాబు!....మా దొరగారికి కారుండేది. ఆ కారు తుడవడం, బాగుచెయ్యడం నేనే చేసేవాణ్ణి మా దొర చనిపోయాడు. మా దొర కొడుకు బాబు పట్నం వెళ్ళిపోయాడు....అప్పుడే చాలా రోజులైపోయింది.

సు : చిన్నప్పటినుంచీ యిక్కడే ఉంటున్నావా?

అ : చిత్తం. బీదవాళ్ళ బ్రితుకులంతే కదు బాబు! మా దొర కొడుకు బాబు, నేను ఆడుకొనేవాళ్ళం చాలా సరదాగా. చిన్నతనం కనుక కలిసి తిరిగాం. ఇప్పుడు?....ఎంతో తేడా!!....అందుకే ఆయన పట్నం పోయాడు....నేను యిక్కడే!....ఒకే తండ్రికి పుట్టినా, ఎవరికర్మవారిది!!

సు : అంటే ?

అ : అదో పెద్ద కథ బాబు!.... మా జట్కా ఎక్కండి బాబు!.... మిమ్మల్ని పట్నంలో వదిలేస్తా. మా గుర్రం చకచక నడు స్తుంది.... బాణంలా దూసుకుపోతుంది. తోలుకర్ర చక్రానికి తగిలించి టకటక మనిపిస్తే, గుర్రం హుషారెక్కి లేడిలా పరుగెత్తుతుంది. ఒక్క గంటలో పట్నంలో ఉంటారు బాబు మీరు!

సు : నీ బండిగురించి బలేగా వర్ణిస్తున్నావే!

అ : ఒక్కసారి ఎక్కి చూడండి.... మీకే తెలుస్తుంది (ఏదో జ్ఞాపకం వచ్చినట్లు నవ్వుతూ).... మీరు గుర్రంమీద స్వారి చేశారా సార్!....దొరలుగా!.... అందుకు అడుగుతున్నా.

సు : ఆ. ఒకసారి చేశాను.

అ : నేను రోజు చేస్తా గుర్రపు స్వారి....చిన్నప్పుడుకూడా చేసేవాడిని.... మనిషి గుర్రంలా వంగి నడుస్తూంటే నేను స్వారి చేశాను. (నవ్వుతూ) ఆ....ఏమీ లేదండీ....మా బాబు, నేను ఆడుకునే వాళ్ళం....చిన్నప్పటి స్నేహం యింకా మర్చిపోలేను....కాని బాబు యిప్పుడు ఎల్లా ఉంటాడో తెలియదు.... మీలా ఉంటాడనుకుంటాను.

సు : ఎవరు మీబాబు ?

అ : ఎందుకులెండి!.... మీతో అనవసరంగా మాట్లాడుతున్నా.... మీ కారు బాగుచేసి పెట్టనా సార్ !

సు : నీపేరు ?

అ : అప్పన్న.... చిన్నప్పుడు దర్జాగా అప్పారావు అని పేరు పెట్టుకున్నాను.... కాని యీ గుర్రింబండి తోలడం మొదలెట్టగానే అందరూ నన్ను అప్పన్న అని పిలుస్తున్నారు. నేనూ అప్పారావు నాయుడూ అని పేరు పెట్టుకొని కారుల్లో తిరగవలసిందే.... కాని నా గ్రిహాలు బాగులేవు సార్ ! (జాలిగా నవ్వుతాడు !)

సు : (నల్ల కళ్ళజోడు ధరిస్తాడు).... అలాగా (బలవంతంగా నవ్వుతాడు).

అ : సాయంత్రిం నల్ల కళ్ళజోడు ఎందుకుసార్ ?

సు : (కంగారుగా). కళ్లు మండుతున్నాయ్ !.... ఇంతకీ మీ బాబు ఎవరో చెప్పావు కాదు.

అ : ఆ. ఏమీలేదు.... మీరు చెప్పమంటే చెబుతా సార్ ! పేరు సుధాకర్‌బాబు.... మా అమ్మ వాళ్ళ యింట్లో దాసీపని చేస్తోఉండేది. బాబు నేను రెండు నెలల తేడాతో పుట్టాం. బాబు తండ్రి మల్లయ్య దొర నన్ను చాలా అభిమానంగా చూసేవాడు.... కొందరంటారు మల్లయ్య దొరకే నేను పుట్టానని ...నాకు ఎనిమిదేళ్ళ వయస్సులో మల్లయ్యదొర చనిపోయాడు. చనిపోతూ నాపేర కొంత ఆస్తి విల్లులో రాశాడంటారు....కాని విల్లు తారుమారయింది. మల్లయ్యదొర భార్య చేతుల్లో....ఆఖరి ఘడియల్లో దొంగ విల్లుమీద సంతకం తీసుకుంది ఆమె.... అప్పటినుంచి బాబును కలుసుకోనిచ్చేది కాదు....బాబు పెద్ద

చదువులకు పెళ్లిపోయాడు ... పెళ్ళయింది. పట్నంలో వ్యాపారం చేస్తున్నాడిప్పుడు.... చిన్నప్పుడు చాలా స్నేహంగా ఉండేవాళ్ళం. కాని తల్లిమాటలు విని మారిపోయాడు బాబు.... పెద్ద కులంలో పుడితేమాత్రం మనిషికి నీచలక్షణాలు ఎందు కుండవు !.... బాబుతల్లి అటువంటిదే.... డబ్బు ఎవరిక్కావాలి ?.... బాబుతో కలిసి తిరగాలనిపించేది.... కాని హోదా మారిందిగదు సార్. దూరమైపోయాం. బాబుకూడా క్రూరుడై పోయాడు. జీవితంలో నన్ను అర్థం చేసుకోలేదు. విల్లులో మల్లయ్య దొర వ్రాసిన ఆస్తి యిస్తానన్నా నేను తీసుకోను సార్ !.... స్నేహంగా ఉంటే ఎంత ఆనందించేవాణ్ణి.... బాబుదొర.... దొరలో దొంగబుద్ధి ఉందని యితరుల కెలా తెలుస్తుంది.... నేను నీచకులంలో పుట్టాను.... నాలో దొర లక్షణాలు ఉన్నాయన్నది ఎవరిక్కావాలి సార్ !.... లోకం మోసం అనిపిస్తుంది. (నిట్టూరుస్తాడు.)

సు : (క్రొయ్యబారి నుంచుంటాడు ఆలోచనగా) అవు.... నవును. ఒక్కొక్కసారి.... అలాగే ఉంటుంది ప్రపంచం....

అ : ఏమిటి సార్ ఆలోచిస్తున్నారు ? మీ డ్రైవరును పిలవండి సార్ ! కారు మరమత్తు నేనూ చేస్తా.

సు : (తాపీగా) డ్రైవర్ !.... డ్రైవర్ !

డ్రైవర్ : (ప్రవేశించి) దొరా !

సు : ఎంతవరకు వచ్చింది మరమత్తు !

డ్రైవర్ : ఒక్క అరగంట యింకా ఆలస్యముంది దొరా !

సు : ఇతడికి కారు మరమ్మత్తు తెలుసుట.... తీసుకు వెళ్లు.

అ : నమస్తే సార్ !

(ఇద్దరూ నిష్క్రమణ)

సుధా : అప్పారావు! హు....కలుసుకోకూడదనుకున్న మను ష్యల్ని కలుసుకుంటున్నా (తిన్నెమీద కూలబడి) యీ కారు చెడిపోవ డం ఈ వేళ ఏదో అఘాయిత్యం తెచ్చేలా ఉంది. అప్పుడే చీకటి పడు తూందే! (గడియారం చూచుకొని ఖంగారుగా పచారు చేస్తాడు.)

(ఒకతను వచ్చి వీధిలాంపు వెలిగించి వెళ్లిపోతాడు. ఆ లాంపు వెలుగు రావిచెట్టు తిన్నెమీద మసకగా పడుతుంది.)

(సత్తెయ్య ప్రవేశం....రోడ్డు బూడిదతో మాసిపోయిన పంచ వేళాడుతూ....మాసిపోయిన పాత కోటుకు ఒక బొత్తాం పెట్టి ఉంటుంది. కాళ్ళకు చెప్పులుండవు....నెరిసిన వెంట్రుకలు నుదురు మీదకు వేలాడుతుంటాయి. చూపు వెర్రిగా ఉంటుంది....సగం తెలి విగా సగం పిచ్చిగా మాట్లాడు తూంటాడు.)

సత్తెయ్య: (స్వగతంగా వెర్రిగా నవ్వుకుంటూ ప్రవేశం. మొక్క జొన్న తింటూంటాడు)....మంచి రుచిగా వుందే....హిహిహి.... వయస్సులో మా అమ్మ పెట్టిన మొక్కజొన్నలా వేడిగా, తియ్యగా ఉంది....హిహి.... (సుధాకర్ వైపు చూసి).... ఓ దొర.... దొర.... హిహిహి....

సు: (కొంచెం భయంగా) ఎవరు?....నీపేరు?

స: పేరులేదుగా!.... ఉంది....హిహిహి....సత్తెయ్య ఎప్పుడూ సత్యం చెబుతాడు....గుండెలో నిజాయితీ. అందుకే ఎవరూ రారు నాదగ్గరకు.... హిహిహి.... నువ్వో! పగటి వేషగాడిలా ఆ వేషం ఏమిటి?....కూర్చో హిహిహి.

సు: (కూర్చోడు) ఫరవాలేదు.... మీరు కూర్చోండి.

స: (కోపంగా, నుంచుని) కూర్చో (కసురుతాడు) కూర్చో మంటూంటే నీకు వినిపించటం లేదూ.... నేను. ఎవరనుకున్నావు? సత్తెయ్యను!.... సత్తెయ్య అంటే యీ వూళ్లో అందరికీ హడలు... హిహిహి. (అనునయంగా) కూర్చోబాబూ!

సు: (కంగారు తగ్గించి ధైర్యం తెచ్చుకొని కూర్చుంటాడు).... సరే మీ యిష్టం.

స: ఈ ముసలాణ్ణి చూసి యింత బెదురెందుకూ.... ఏమీ చెయ్యను.... సరదాపుడితే గట్టిగా కరుస్తా. అంతే హిహిహి.

సు: (కంగారుగా నుంచుంటాడు) ఉహు....

స: నుంచుంటావా?.... నుంచో!.... నీ ఖర్మ.... (దగ్గరికి వచ్చి సుధాకర్ తలమీద టోపీ లాక్కుని తగిలించు కుంటాడు).... నేను విజ మైన దొరను!.... హిహిహి.

సు: (భయంగా) మీరేంచేస్తారు ఈ వూళ్లో?

స: చంపేస్తా!.... హిహిహి.... అబ్బే.... మనుషుల్ని చంపేస్తా అంతే!.... చంపేశాగా ఒకరిని!.... వాడు చావవలసిందే.... అసలు వాణ్ణి చంపలేక పోయాను.... అయితేనే చచ్చిన నా కొడుకు మళ్లీ బ్రతక గలడా? (హిహిహి) నిన్ను చంపెయ్యనా?

సు: (భయంగా జేబురుమాలుతో చెమటలు తుడుచుకుంటూ, అరుస్తూ) డ్రైవర్!.... డ్రైవర్! ఈ కారు ఎంతకీ బాగుపడేలా లేదు.... ఈ రోజు ఎవరిముఖం చూచానో కాని

స: మొహంలోకి చూడు.... కథ చెప్పనా?....ఇదంతా పొలం తగాదా!...ఒక దొర మోసంచేసి మా పొలం ఆక్రమించా లను కున్నాడు....సరిహద్దులు తగాదాలే పాడు....అర్ధరాత్రి వరి కొట్టానికి విప్పంటించాడు....నా కొడుకు మండిపడ్డాడు. విప్పంటించిన వానిని చావగొట్టాడు.... మర్నాడు కాపలా కాసేడు పొలంలో.... రౌడీలు వచ్చారు నా కొడుకును చంపేసి పిల్లకాల్వలో విసిరేశారు (ఏడుస్తాడు.)

సు: (ఏమనాలో తెలియక) ఊరుకోండి....ఏడ్వకండి.

స: (ఏడ్పు మాని) నాకు బాధ ఆగలేదు!...ఉడికిపోయింది రక్తం....చంపెయ్యాలని బయలుదేరాను...నా కొడుకును చంపించిన బాబు ఆ రాత్రి యింట్లోంచి పారిపోయాడు. అతడి బదులు వాళ్ళ యింట్లో దాసీని పొరపాటున చంపేశాను...అది తెలుసుకుని (....ఏదో చూస్తున్నట్లు కెవ్వున కేక పెడతాడు)... బుర్ర తిరిగింది...కట కటాలు...కొన్నాళ్లు...ఎవరో ఎర్ర టోపీవాళ్లు...మళ్లీ ఇక్కడ... ఇక్కడే తిరుగుతున్నా...ఈ వూళ్లో నన్ను పిలిచి అన్నం పెడతారు... ఆ కోరమీసాలవాడు...అన్నం పెడతాడు...ఎందుకూ?...హిహిహి... అన్నం ఎక్కువ వుందా వాళ్ళకి...మొక్కజొన్న పొత్తి తింటావా?... (తిన్నెమీద బూడిద పట్టిన మొక్కజొన్న పొత్తి యిస్తాడు).

సు: వద్దు... మీరు తినండి. (కోపంగా)... డ్రైవర్!... డ్రైవర్!.

స: ఆ కారు నీదేనా?.... కారు బర్రుమని పరుగెడుతుంది... నేనూ పరుగెడుతా?...(బర్రుమంటూ అరుస్తాడు)...హిహిహి...కారు కూతలా ఉందా నా అరుపు!...హిహిహి...ఈ మొక్కపొత్తి ఎక్క డిదో తెలుసా?...మా పొలంలోది...నీకు పొలాలున్నాయా!

సు: ఆ...కొద్దిగా ఉన్నాయి.

స: ఎక్కడ?....ఈ వూళ్ళోనే:.... హిహిహి...నువ్వే వాడు.... నా కొడుకును నువ్వే చంపేశావు...నిన్ను చంపేస్తా!... (దగ్గరికి కోపంగా వెడతాడు.) నీ మొహం చూడనీ...నువ్వు కాదు (నవ్వుతాడు) హిహిహి...అంతేలే నాతో స్నేహం చేస్తే అంతేలే!... ఇంతే.... హిహిహి

సు: ఎవరు చంపారు నీ కొడుకుని?

స: ఏమో!... ఎవరో?... రక్తం గడ్డకట్టింది శవంమీద.... తల బీటలు పడింది....నా కొడుకు....బంగారంలాంటి కొడుకు!...నా కోడలు లచ్చి గోల...మా బాధలు ఎవరిక్కావాలి? (ఏడుస్తాడు).... నేనేం అపకారం చేశాను. అంత కక్ష?...మనిషిని చంపాలా? కావాలంటే ఆ బెత్తెడు పొలం యిచ్చేసేవాడినే! సుధాకర్....కనిపిస్తే... చంపేస్తా (రౌద్రంగా లేస్తాడు)

సు: (భయంగా కూర్చోండి.)

స: కూర్చోను. (తలమీద చేతులు పెట్టుకుని బాధగా తిన్నెమీద కూలబడతాడు.)

సు: డ్రైవర్!...డ్రైవర్!.

డ్రై: (ప్రవేశించి)...ఒక్క పావుగంట సార్!.... మరమ్మత్తు పూర్తి అయిపోతోంది.

అప్పన్న: (వచ్చి)...వీ డిలా వచ్చాడేమిటి?

స: నువ్వా....హిహిహి...నీబండి ఏదీ?....చక్‌చక్‌చక్....టక్ టక్‌టక్ బలేగా పరుగెడుతుంది నీగుర్రం.... కారు భ్రమం

టుంది.... గుర్రం చెంగు మంటుంది. చెంగ్! చెంగ్....చెంగ్....!
(అంటూ పోతాడు.)

అప్పన్న: మా అమ్మని చంపేశాడు సార్ యితను....కాని ఇతనిమీద నాకు కోపంలేదు... ఈ పరిస్థితులకు సుధాకర్‌బాబు మూలం....కాని చిన్నప్పటి స్నేహం తల్చుకొని ఊరుకుంటూంటా। ఎవరిఖర్మ వారిది సార్....కాని సుధాకర్‌బాబు అంత కసాయి వాడిలా అవుతాడని అనుకోలేదు...వస్తా సార్!.... బేరం తగిలింది....

సు: యీ పైసలు తీసుకో!

అప్పన్న: అక్కర్లేదుసార్। ...కారు అంటే సరదా....అందుకే మరమ్మత్తు చేశా....అంతే (వెళ్లిపోతాడు)

సు: త్వరగా మరమ్మత్తు పూర్తిచెయ్యి....అప్పుడే ఏడున్నర గంట లయింది...ఇంత ఆలస్యమా! వెళ్లు!... (డ్రైవర్ భయంగా నిష్క్రమణ)....ఇరవై సంవత్సరాల క్రితం పాతుకుపోయిన కథ మళ్లీ బయటపడుతోంది....అనవసరంగా ఒప్పుకున్నా యీ సభకు వస్తానని....రాకపోయినా బాగుండేది....ఛ!.

(చీకటిలో వీధిలాంపు వెల్గు తిన్నెమీద పరిస్ఫుటంగా పడు తుంది....సుధాకర్ పచారు చేస్తూంటాడు ఆలోచిస్తూ భయంగా... సిగరెట్టు వెలిగిస్తాడు.)

సు: ఈ వూళ్ళో యింకా ఏం జరుగుతుందో! ఏమీ అర్థం కావటం లేదు!...ఎవరూ జనంకూడా కనిపించటం లేదు చుట్టూ.

(సింగన్న...పరివేశం... నల్లబనీను... లావు మీసాలు... సైకిలు కట్టు పంచ మోకాలు కిందకు కొద్దిగా....కాలికి వెండి చూచ

కడియం...కొంచెం వృద్ధుడయినా పుష్టి శరీరం...తలకు తువ్వాలు పాగా చుట్టి...ఒడుపుగా చేతిలో చుట్ట పట్టుకు వస్తాడు).

సింగన్న: అయ్యా!....అగ్గిపెట్టె ఉందా!

సు: (కంగారుగా ఉలిక్కిపడి వెనక్కి తిరుగుతాడు; సర్దుకుని జేబులోంచి పెట్టె తీసి యిస్తాడు... మెల్లిగా నవ్వుతాడు) ఉంది.... తీసుకో.

సిం: మీది పట్నమా అయ్యా!.

సు: మరే!

సిం: తెలుస్తోంది...మిమ్మల్ని చూడగానే

సు: (నవ్వుతూ) ఏమని?

సిం: బాగా డబ్బున్నవారని.... ఆ కారు మీదేనా?... ఆగి పోయిందా?....తొయ్యమంటారా? (ఒడుపుగా చుట్ట తాగుతూంటాడు)

సు: నీపేరు?

సిం: నా పేరుకేంగాని .... నేను యిక్కడ కూలిచేసుకుంటూంటా...(అగ్గిపెట్టి పరీక్షగా చూసి యిచ్చేస్తాడు...బెదురుగా తీసుకుంటాడు సుధాకర్)

అయ్యా!...చీకట్లో ఒంటరిగా ఉన్నారే!...

సు: నువ్వుకూడా ఉన్నావుగా!.... ఫర్వాలేదు.

సిం: వూళ్ళో దొంగతనాలు బాగా జరుగుతున్నాయి. జాగ్రత్త సుమండీ!....

సు: ఆ....నా దగ్గరేముంది దొంగిలించడానికి!....

సిం: దొరలు మీ దగ్గర ఏమీ లేకపోవడమేమిటి? ఒకవేళ ఏమన్నా దొంగిలించినా, మీకు పెద్ద అంత లెక్కలేకపోవచ్చు... (నవ్వుతాడు)

సు: ఆ...ఆ... అంతేలే.

సిం: అయ్యా!... నీ సిగరెట్టు మాని నా చుట్ట తాగ్రికూడదూ... ఇది లంకపుగాకు చుట్ట. బలే రంజుగా ఉంటుంది...ఇమ్మన్నారా?

సు: (ఏమనాలో తెలియక) ...ఇయ్యి.

సిం: (చుట్ట యిస్తాడు....సుధాకర్ సిగరెట్టు విసిరేసి, చుట్ట నోట్లో పెట్టుకొని వెలిగించుకో బోతూంటాడు)...ఆగు అయ్యా!... నేను నిప్పుపెట్టి వెలిగిస్తా (చుట్ట వెలిగించి ఒడుపుగా ముఖం లోకి చూస్తాడు...సుధాకర్ కంగారుగా చుట్టదమ్ము లాగుతూంటాడు... సింగన్న తననోట్లోంచి చుట్ట పొగ సుధాకర్ ముఖంపైని దట్టంగా గుప్పుమనిపిస్తాడు...మొలలోంచి కత్తితీసి...కంఠం దగ్గర కోటు కాలరు పట్టుకుంటాడు) అరుస్తే పొడిచేస్తా. ఎంత డబ్బుంది?...

సు: డబ్బు!...ఏంలేదు...

సిం: ఇదేమిటి?...బాకు తెలుసా?...కంఠంలోంచి బాణంలా దూసుకు పోతుంది ఒక్క నిమిషం ఆగితే... మరుక్షణంలో... ఎక్కడుంటావో తెలుసా?...

సు: జేబులో ఉంది తీసుకో.

సిం: చేతులెత్తు!.

సు: (ఎత్తుతాడు)

(సింగన్న డబ్బు తీస్తూంటే, సుధాకర్ డ్రైవరిని పిలవబోతాడు)

సింగ: (కంఠంమీదికి మళ్లీ కత్తి ఎత్తి)...అరుస్తే ఒక్క క్షణంలో యమలోకం చూస్తావు...నేను ఎవరో తెలుసా...దొంగ తనాల్లో ఆరితేరిన సింగన్న...ఆ!! కంఠంమీద యింత పెద్ద పుట్టు మచ్చ! మా సుధాకర్‌బాబుక్కూడా ఉండేది?...నీపేరు?

సు: సింగన్నా! నేను సుధాకర్‌ను...సుధా...కర్.

సిం: నువ్వా!... నువ్వా!... సుధాకర్... (వదలుతాడు)... (వ్యంగ్యంగా నవ్వి)... ఏమిటి?... ఎన్నాళ్లకు కనుపించారు దొర గారూ!...అనాడు డబ్బు లంచంపెట్టి ఉసికొల్పి...నేర్పావుగా హత్యలు చెయ్యటం!...గురువుగారికి గురుదక్షిణ యిస్తా యివ్వాళ!...నువ్వు నేర్పిన విద్య నీమీదే ప్రయోగిస్తా!.

సు: సింగన్నా!...నీతో చాలా పనులున్నాయి!...నీకు డబ్బు ఎంత కావాలి?

సిం: ఛీ!...నీదగ్గర డబ్బు తీసుకోడం మహాపాపం!... ఈ సింగన్న మారిపోయాడు...ఆ రోజు దొంగతనంగా యింట్లోంచి పారి పోయావు...మర్నాడే నీ కుటుంబాన్నికూడా తీసుకుపోయి పట్నంలో మేడల్లో హాయిగా బ్రతక గలిగావు!...నీ పొలాలన్నీ అమ్ముకొని ధనం తెప్పించుకొని, ఈ వూరితో తెగతెంపులు చేసుకున్నావు!...ఎలా గైనా దొరగారిని!... ఇక్కడ మా సంగతి ఏమయిందో ఆలోచిం చావా?...పట్టు బడలేదు కాబట్టి సరిపోయింది.

సు: నీ లచ్చి నీకు దొరికింది కదూ!...సింగన్నా!...

సి: లచ్చి...లచ్చి...లచ్చిమీది నా ప్రేమ నీ మోసానికి ఉపయో గించింది...అనాడే సత్తెయ్య కొడుకును హత్యచేసి ఉండకపోతే లచ్చిని కళ్ళతోనైనా చూసుకుంటూ ఉండేవాణ్ణిగా!... దొంగతనాలు

చేసే నన్ను ఎలా ప్రేమిస్తుంది లచ్చి!...పాపం! ఆ సత్తెయ్య నావల్ల పిచ్చివాడై పోయాడు...లచ్చి ఉరిపోసుకు చచ్చిపోయింది...అప్పటి నుంచి ఒట్టుపెట్టుకున్నా...దీనికంతా కారణమయిన నిన్ను చంపెయ్యా లని!

సు: జరిగిపోయిందేదో జరిగిపోయింది...వూరుకో సింగన్నా.. యీ వందరూపాయలు తీసుకో!

సిం: అవును ఈ వేళ వందరూపాయలు కావాలి...ఎవరిని దోచుకోవాలా అనుకుంటూంటే నువ్వు కనుపించావు...దొంగతనాలు మానేసి చాలారోజు లైపోయినా...యీవేళ చెయ్యాలనుకున్నాను. సత్తెయ్య పిచ్చి బాగుచేస్తానని ఒక వైద్యుడు నాకు నమ్మకం కలిగించేడు...అందుకే ఈ వేళ దొంగతనం...నాకు ఎవరిస్తారు ఊరికే వందరూపాయలు...నువ్వు కనుపించడం మంచిదే!... యీ డబ్బు లంచంగా తీసుకుని నిన్నే హత్యచేస్తా!...నిన్నే చంపేస్తా సుధాకర్ బాబూ యీవేళ! (కత్తి ఒడుపుగా పట్టుకుని దగ్గరగా వెడతాడు)

సు: (భయంగా)...సింగన్నా...ఆగు...

సిం: ఆగను...యీవేళ నీకు ఆఖరిరోజు!...సుధాకర్ బాబూ! .. మీనాన్న ఎన్నో వంశాలు నాశనంచేసి ఆస్తి సంపాదించాడు...మరో అన్ని పాపాలుచేసి వూళ్ళో కలహాలు రేపి, తంత్రాలు పన్ని ఆ ఆస్తిని నువ్వు కొండలా పెంచుతున్నావు....ఎంతకాలం అనుభవిస్తారు యీ భోగం!, నీ పాపిష్టి బ్రతుకు యీ రోజుతో ఆఖరు!...యీరోజుతో నిన్ను చంపేస్తా సుధాకర్...తప్పదు...(కంఠం మీదికి కత్తి జోరుగా ఎత్తి ఆలోచనగా ఆగిపోతాడు.)

సు: (హతాశుడై కోలుకొని, భయంగా సర్దుకుంటాడు)..... సింగన్నా...నువ్వు చా...లా...మంచి...వాడవు...నాకు తెలుసు।.

సి: నేనా...మంచివాణ్ణి...(నవ్వి)...పో।...నిన్ను చంపితే ఏంవస్తుంది...చచ్చిపోయిన లచ్చి తిరిగి కనిపించదు...నువ్వు కత్తి పోటువల్ల చావకూడదు సుధాకర్।...ఇంతకాలం నువ్వు కనిపిస్తే చంపెయ్యాలని వేచివున్నా కోపంగా।...కాని నువ్వు కనిపించేక ఎందుకో చంపలేక పోతున్నా...నిన్ను శారీరకంగా హత్య చేయ కూడదు...నిన్ను మానసికంగా హత్యచేసి కఠోరమైన చావుపాలు చెయ్యాలి...ఏం చేస్తే బాగుంటుంది సుధాకర్‌బాబూ।...

సు: (భయంగా, దీనంగా) ఏమీ చెయ్యకు...ఏమీ...చెయ్య...కు సింగన్నా।...

సిం: నీకు శిక్ష విధిస్తా।...కఠోరమైన శిక్ష. మా అందరి బాధలు ఉసురు నీకు తగలాలని శపిస్తా! రోగాలతో, పక్షవాతంతో మంచానపడి, యీడ్చుకుని, బాధపడి, మరీ చావాలి నువ్వు! సుధాకర్ నువ్వు నీ వంశంచేసిన పాపాలు పుండ్లై నీ శరీరమంతా పుచ్చిపోవాలి సుధాకర్।...నువ్వు బాధపడాలి!... ఉరిపోసుకు చచ్చిపోయిన లచ్చి, పిచ్చి ఎక్కిన సత్తెయ్య, చచ్చిపోయిన అప్పన్న తల్లి, విరాగి అయిన బండి అప్పన్న, కసాయిచావు చచ్చిన సత్తెయ్య కొడుకు...వీళ్ళందరి బాధ ఏమైపోతుంది?...నీకు శనిదేవతలా పరిణమిస్తుంది సుధాకర్ బాబూ।...నిన్ను వదిలేస్తా యీ వేళ...నా మంచితనంతోనే వదిలేస్తా... ఎవరు దొంగ!.... ఎవరు దొర?...నిజం ఎవరు నిర్ణయించగలరు?

సు: సింగన్నా యీ వందరూపాయలు తీసుకెళ్లు—అవసరం కదూ।...

సిం: ఛీ!...నీ డబ్బుతో మందు యిప్పిస్తే ఆ సత్తెయ్యకు పిచ్చి తగ్గదు....ముష్టి ఎత్తుతా వందరూపాయిలు ఎక్కడైనా....సుధాకర్ బాబూ....దొర!....దొరకాదు దొంగ!....దొంగేకాదు...ద్రోహి!.

సు: సింగన్నా!

సిం: మళ్లీ పిలుస్తే...నా నిర్ణయం మార్చుకోగలను....(కత్తి చూపిస్తాడు)...పో నిన్ను చంపితే ఏంవస్తుంది .... (గద్గదంగా) చచ్చి పోయిన లచ్చి కనుపించదుగా.... (నిష్క్రమణ)

సు: ఇదేమిటి?....కలా?...కాదు...

ఊళ్ళోకి వెళ్ళకపోయినా యిరవై సంవత్సరాల క్రితం నాటి చరిత్ర, ఆనాటి వ్యక్తులు అందరూ నా ముందుకే వెతక్కుంటూ వచ్చి నట్టుందే!....ఆగ్రహం అణచుకుని, ఆర్థిక పతనంలో ఉన్నా ఆతిధ్యం అందించి ఔదార్యం చూపిన బీదదొర శోభనాచలం!.... మోసంచేసినా మమతల జ్ఞాపకాలతో మురిపించిన మంగమ్మ!...తల్లి హత్యకు కారకుణ్ణి అయినా బాల్య స్నేహంతో నన్ను క్షమించిన విరాగి అప్పన్న!....కలహాల క్రౌర్యానికి బలిచేసినా, గతంవల్ల మతిచెడి బ్రతుకుతున్న సత్తెయ్య?....ప్రతీకార వాంఛతో ప్రేమికురాలి మర ణంతో మారిపోయిన ఆరితేరిన దొంగ సింగన్న!... వీళ్ళందరికీ క్షమాపణ చెప్పుకుంటే మళ్లీ గ్రామంలో అడుగుపెట్టి మంచిగా బ్రతుకుతే...డ్రైవరు!... డ్రైవరు!....

డ్రై: (ప్రవేశించి) మరమ్మత్తు అయిపోయింది....కారు సిద్ధ మయింది దొరా!...

సు: డ్రైవరు! కారు ఊళ్ళోకి పోనీ!.... అందరినీ యీ వేళ కలుసుకుంటా.

డ్రైవర్: ఎవరిని దొరా?....ఎందుకు దొరా?...

సు: కారు వూళ్ళోకి పోనీయ్ డ్రైవర్!....

డ్రై: ఎందుకు దొరా!....ఒక్క గంటలో పట్నం చేరుకుంటాం...తొమ్మిది గంటలకు పట్నంలో విందు ఉందికదూ...దొరా!.... మళ్లీ రేపు మద్రాసు పోవాలి దొరా!....

సు: మద్రాసు...అవును వెళ్లిపోవాలి!...క్షణం తీరికలేని... ఆ జీవితం!....వ్యాపారం! ధనం....మేడలు... విందులు, సరదాలు..... పొగడ్తలు...సేవకుల కొలువు పెద్దహోదా!....ఆ జీవితంలో గతమంతా మర్చిపోవచ్చు. పల్లెటూరి మోటు మనుష్యులను క్షమాపణ అడగటమా!....అడుగుతే క్షమిస్తారని నమ్మకమేముంది. మళ్లీ కనిపించి బ్రతుకు అపాయానికి గురిచేసుకోడం అవుతుంది...జీవితంలో ఏదైనా సాధించాలంటే ఏ చెడూ చెయ్యకుండా ఏమవుతుంది?... బ్రతుకులు అభివృద్ధికి చేసే యుద్ధం సంఘర్షణలో కొన్ని నలిగిపోతాయి...అందుకు పశ్చాత్తాప పడితే ప్రయోజనం...శూన్యం!...ఎవరి బ్రతుకు వారిది!... డ్రైవర్!...కారు పోనీయ్! పట్నమే పోనీయ్!...మరొక క్షణంలో హోదా బ్రతుకు, సరదా యిచ్చే స్నేహితులు, రుచికరమైన విందులు మనస్సుకు శాంతి యిస్తాయి...జరిగింది ఒక కలగా మసక మసకగా మాయమై పోతుంది!.... (నిష్క్రమణ)

స: (ప్రవేశించి)....హిహిహి....కారు బర్రుమంటూ పోయింది ...హిహిహి...కారు...పెద్దకారు. నిగనిగలాడే కారు! హిహిహి... గర్వంగా! హోదాగా_ ఠీవిగా బర్రుమంటూ పోయింది...మిగిలింది దుమ్ము!...కారు బర్రుమంటూ పోయింది...కళ్లల్లో దుమ్ముకొట్టి పోయింది...హిహిహి... (నిష్క్రమణ.)

# పాత్రలు

శివం

శవం

భవం

భారం

ఇహం

పరం

శూన్యం

## ఒకటో రంగము

(పార్కు—సీను. స్టేజికిచుట్టూను పూలకుండీలువుంటవి)

భవం : (ప్రవేశిస్తు) ఆహాహా ! ఏంగాలి, ఏంగాలి ! భలేగాలి హృదయపులకిత మలయమారుతము! నాజుట్టు రింగులు నృత్యంజేయించే పిల్లగాలి : ఇటువంటి పిల్లగాలులు ఆనందించడానికే కాబోలు అందరు సాయంత్రము పార్కు—లకు వస్తారు. (ముక్కు—నిండా గాలిపీల్చి) ఆహాహా ! ఏం. ఘుమ ! ఘుమ ! అసలు పిల్లగాలిలోనే ఘుమ ఘుమ లున్నాయి. దానికితోడు ఈ పార్కు—లోని పూలవాసనలు ! వచ్చేపోయే వాళ్ళ సెంటువాసనలు ! ఇంకచెప్పేదేముంది ! అసలే కవిని. ఇంక యిటు వంటి ఘుమఘుమ సందర్భంలో కవిత్వమురాక పోతుంది ?

(1) గాలిలో గాలి
గాలిమీద గాలి
బహు పిల్లగాలి
అతి చల్లగాలి
మహామంచి గాలి — గా॥

(2) గాలిలోని
సౌరభాలు
కదిలించి
చూచాయి
నా హృదయ
తంత్రిలను !

బలేగాలి చక్క—టి పిల్లగాలి ! ఆహాహా ! ఏంగాలి (అంటూ తన్మయత్వములో ఉంటాడు)

భారం: (దూరాంనుంచి కర్నాటక సంగీతం రేడియోద్వారా విని పిస్తూవుంటుంది తాళంవేస్తూ ప్రవేశం) (మధ్యలో పాట ఆగిపోతుంది)

ఏమిటీ పనికిమాలిన రేడియోలు! మధ్యలో గబుక్కున ఆగి పోతాయి. ఇటువంటి రేడియోలు పార్కుల్లో ఉంటే మనము పాటలు విని ఆనందించినట్లే! పాడేవాడిగొంతుక పాడైందో తెలియదు—లేక రేడియో తగలబడిందో తెలియదు! అసలునేను ఏపాట సాధనము చేయుటమొదలుపెట్టినా అది సగములో ఆగిపోవుటం పరిపాటైపోయింది. అయినా, పాటలేకపోతే తాళం సాధనమానమని ఎవరుచెప్పారు! తకిట—తకిట— (అంటూ తాళంవేస్తూ తన్మయత్వంలో వుంటాడు)

ఇహం: (చేయిచూసుకుంటూ ప్రవేశం) ఈ పరీక్షఇలాపోతుంది అనుకోలేదు. అక్కడికి సూర్యరేఖ విజృంభిస్తూనేవుంది. ఈ రేఖ బాగుంటే విద్య బాగావస్తుంది అంటారు. మరి నా పరీక్ష పోవడానికి కారణం! నాస్నేహితుల్లో చాలామందికి వాళ్ళ పరీక్షలు పోతాయని జ్యోతిష్యము చెప్పాను. నేను అలా చెప్పినవాళ్ళందరి పరీక్షలు పోయి నాజ్యోతిష్యము అక్షరాలా ఫలించింది. కాని నా పరీక్ష ప్యాసవు తుందనుకుంటూంటె ఇలాపోవడ మేమిటి? అయినా ఈ మధ్య చేతి రేఖలు బాగా కనిపించటంలేదు. అస్తమానం నాటకాల్లో కొట్లాడు తూంటే ఆ రంగులు ఈ రేఖల్లోదూరి కొన్నిరేఖలను కనుపించకుండా మాయం చేయవచ్చు. అసలు ఈ జ్యోతిష్యమే క్లిష్టసమస్య! ఉత్తి జ్యోతిష్యంమీదే ఆధారపడి ఊరుకోవడంవల్ల నాపరీక్షపోయి మరీక్లిష్ట సమస్య వచ్చిపడింది!.... అయినా, నాపరీక్ష ఎందుకు పోయిందో? (చెయ్యి తీవ్రంగా పరిశీలిస్తూ వుంటాడు)

శూన్యం: నాపేరు మావాళ్ళు తూచి తూచి పెట్టారు. లేకపోతే నా పరీక్ష ఇన్నిసార్లు పోవడమేమిటి? నాకు ఎక్కడాలేని వైరాగ్యం వస్తూంది.

చుట్టుపక్కలంతా శూన్యంగావుంది. నా భావిజీవితం శూన్యంలా కన పడుతూంది. అందుకే నా పేరు శూన్యంఅన్నారు. (అంటూ దిగాలుగా ఒకమూల విచారంగా కూచుంటాడు)

పరం: (ఒక బుజాన కెమెరా మరొకచేతిలో పెన్సిలు నోటు బుక్కు ఫెల్టుహేటుతో ప్రవేశిస్తూ)

ఏమిటోయ్ భవం! గాలిగాలి అంటున్నావు. ఏమన్నాగాలి పట్టిందా ఏమిటి? ఇదిగో మన భారంకూడా ఇక్కడేవున్నాడు. వీడేదో పాట సాధనం చేస్తున్నట్టున్నాడే? ఏంరోయ్? పదిమంది మసిలే పార్కులో కూడా నీకీపాట సాధనతప్పలేదూ ...ఇదిగో మన ఇహం కూడా ఇక్కడేవున్నాడు వీడికి ఇదోరోగం! ఎప్పుడూ చెయ్యిచూసుకో వడమే వీడిపని లేకపోతే ఇంకొకడి చెయ్యి పట్టుకొని వదిలిపెట్టడు.... ఉహూ! మన శూన్యంకూడాచేరాడూ! బాగుంది. ఏమిటరా! .... ఒక ళ్ళతో ఒకళ్ళు మాట్లాడుకోకుండా తపస్సుచేస్తున్నారేమిటి.

భవం: ఈ చల్లగాలిచూసేటప్పటికి కవిత్వం రాయబుద్ధిపుట్టిం దిరా! తీవ్రంగా కవిత్వం ఆలోచిస్తున్నా. ఒకగేయం అల్లానోయ్! (గాలిలో.... అని పాడుతాడు)

పరం: భేష్! చాలాబాగుంది నీగీతం!.... అయితే మనపరీక్షఫలి తాలువచ్చాయికదా! నీ గీత ఏమయింది?.

భవం: ఒరే! కవులు ఎక్కడన్నా పరీక్షలుపాసవుతారా! అసలు, నిజమయిన కవి ఎప్పుడూ పరీక్షపాసవడు అనుకో! వాడెప్పుడూ కని విని ఎరుగని విషయాలు గురించి ఊహించి ప్రజలకు తెలియజేస్తాడు. ప్రపంచములో ఉన్నవిషయాలు వాడికక్కరలేదు.... నేనేపెద్దపెద్ద గ్రం థాలురాసేశక్తిగలిగి ఉన్నపుడు ఇతరులు రాసిన గ్రంథాలుచదివి పరీక్షలు

పాసవడ మెందుకు ? అనిపిస్తోంది.... ఏదోకాస్తోకూస్తో డబ్బువుంది ఉద్యోగం చెయ్యక్కరలేదు. ఇలాగే కవిత్వసేవచేస్తూ కాలక్షేపం చేస్తాను.

పరం: అయితే ఇహం ! నువ్వు పరీక్షపాసయినట్లేనా ?

ఇహం: అదేరా !, చెయ్యిచూచుకొంటున్నాను. ఇప్పుడుపోయిన పరీక్షకేమి చేయలేంగాని ముందు ముందు ఎంతత్వరలో పరీక్షపాసవ గలనోఅని ఆలోచిస్తున్నాను.

పరం: ఇకమన శూన్యం, భారం పరీక్షలుపాసవరని ఢంకాబజా యించి చెప్పొచ్చు.

శూన్యం: నీ ఊహ అబద్ధంకాదనుకో. నాకంతాశూన్యంగా కను పిస్తోందిరా ఈ పరీక్షపోవడంవల్ల.

పరం: నీకది అలవాటేగా !

భారం: పోనీలెద్దూ! ఎందుకూ ఉపయోగంలేని పరీక్షలు ఇవి మనల్ని వుద్ధరిస్తాయిగనుకనా ! M. A. లు పాసయి గుమాస్తా గిరీలు జేస్తూ, ఎంతమంది నానా అవస్తలు పడటంలేదూ. ఇంక మనం పరీక్ష పాసయి బావుకునేదేమిటి ?....నాకుకొంచెం సంగీతము వచ్చుగా ఈ గానకళపోషించుకుంటూ జీవితము గడపాలని వుందినాకు—సినిమాల్లో పాటలుపాడి ఎంతమంది డబ్బుసంపాదించటంలేదు ! పరం ! ఒక్క సినిమాఛాన్సు దొరికితేసరి ఇంక పరీక్షల మొహం ఎవరుచూస్తారోయి.

భవం: అయితే పరం ! నీసంగతి ?

పరం: మీ స్నేహబృందములో ముఖ్యుణ్ణిగదా నేనుప్యాసవుతే మన బృందానికి అవమానముకాదుటోయ్ అందుచేత నేనుఫేలయిపో

యాను—అయినా, ఇష్టంగాని పాఠాలు చదువుతే ఏమొస్తుంది మనకి.... అసలునాకు జర్నలిజమంటే చాలాయిష్టం ఆజర్నలిజములో నాజీవిత మంతాధారపోసేద్దా మనుకుంటున్నా.-(శవం ప్రవేశించి తనస్నేహితుల్ని చూసి పొంగిపొరలి వచ్చేదుఃఖంతో గబగబావచ్చి భవాన్ని కౌగలించు కుంటూ)

శవం: ఒరేభవం! (ఏడుస్తూ) అనుకున్నంత పనీ అయింది. నా పరీక్ష పోయిందిరా! మానాన్నకు కోపంవచ్చి ఇంట్లోంచి గెంటేశాడురా!

భవం: అరెరే! పాపం. ఇంట్లోంచి గెంటెయ్యటమే?

శవం: మరే.! మాసవతి తల్లిగూడా బాగా పురిఎక్కించేసిందిరా. ఈ విషయంలో.

ఇహం: పాపం? ఎంతకష్టమొచ్చిందిరా! నీచెయ్యిచూచినప్పుడే అనుకున్నాను. నీకెప్పుడో ఒకప్పుడు ఇటువంటి కష్టంవస్తుందని.

శవం: పైగా మానాన్నకి మనంనాటకాలలో వేయటం, ఎన్ని కలలోపాల్గొనటం, సినిమాలకుపోవడం మొదలయినవన్నీ తెలిసేయట. "ఇటువంటి దౌర్భాగ్యపు పనులన్నీ చేస్తేఇంక చదువులేంసాగుతాయి! పరీక్షపోయిందంటే పోదూమరి! నీకిదేశిక్ష." అనీ ఇంట్లోంచి గెంటే. శాడురా!!

శూన్యం: (ప్రక్కగా) వీడిబ్రతుకుగూడా శూన్యం అయి పోయిందిపాపం.

శవం: పోనీ నా అంతటనాకు నాటకాలువేసే భాగ్యమైనా కలిగింది కనుకనా. మీరంతా నాటకాలువేస్తుంటే ప్రక్కనుంచి అవిఇవి అందించి సదుపాయాలు చేసేవాణ్ణి. నాటకంలో ఒకఛాన్సన్నా ఇప్పించండార్రా అంటే మీరు చచ్చినా ఇచ్చారా!.... ఎన్నికలలో పాల్గొనటంనిజమే!

కాని అప్పటికప్పుడు ఏదోఉద్రేకంవచ్చి కొంతమందికి చాకిరీచేశాను.... పోనీచదువులో అశ్రద్ధచేస్తే అనుకోవచ్చు కొంచెమైనా విశ్రాంతిలేకుండ రాత్రింబగళ్ళు టీతాగిదగ్గుతెచ్చుకొని ఆయాసపడి పరీక్షలముందు పుస్త కాలుఅన్నీ చదువలేదటా? .... మనపరీక్షముందు మావూరునుంచి మా వెంకయ్య వచ్చాట్ట. వచ్చినావిషయాలన్నీ వాకబుచేసి ఉన్నవీ లేనివి అన్నీకలిపి పితూరీలుచెప్పాడుట.

పరం: ఎవడురా ఆవెంకయ్య! వాడిని పేపర్లోపెట్టి ఏకేసి మరీ వదిలిపెడుతా!

శవం: ఉన్నాడులే మానాన్నకు ఒక త్రాస్టపుస్నేహితుడు. ఆ వెంకయ్య ముందు ఆ నాడేప్రతిజ్ఞపట్టాడుట మానాన్న. నాపరీక్షపోతే ఇంట్లోనుంచివెళ్ళగొడతానని.

భవం: అయితే తకిట....దికిట....తద్దికిట అని దవడబాజాలు గూడాచేసేడా మీనాన్న.

శవం: అవిమాత్రం తప్పుతాయి?

భవం: నీకష్టంచూస్తుంటే దుఃఖరసంతోకూడిన కవిత్వం వస్తూందిరా

శవం: పైగా! రెండేళ్ళకు ప్రత్యేకంగా నాలుగువేలు ఖర్చుపెట్టా డుటనాకోసం మానాన్న. అసలేమానాన్న పీనాచి. ఈ లోకువచూసి మా సవతితల్లి "డబ్బంతా తగలెట్టాడు. ఇవేంచదువులు బాబూ!" అంటూ సూటీ పోటీ మాటలుచెప్పి మానాన్నకు మరీకోపంతెప్పించింది. ఇంతకీ ఆడబ్బు అనవసరంగా పరాయివాళ్ళకు ఖర్చుపెట్టానుగనుకనా! స్నేహి తులు కాబట్టి మీ అందరికి అప్పుడప్పుడు ఊరికనే ఇచ్చేవాణ్ణికాదటా!

శూన్యం: నీకష్టం నాగుండెలు బ్రిద్దలుచేస్తూందిరా శవం! నీపరిస్థితులుచూసేటప్పటికి నీపేరుగూడా శూన్యం అని మార్చుకుంటే బాగుంటుంది అనిపిస్తోంది.

శవం: పరీక్షపోయిందని తెలియగానే నాకువళ్ళుమండీ, ఆపేపర్లు దిద్దేవాడు ఏదో కసికొద్దీనో, లేక పెళ్ళాంతో దెబ్బలాడి మనస్సుబాగులేని సమయంలో పేపర్లుదిద్దటంవల్లనో తక్కువమార్కులు ఇచ్చివుంటాడని అనుమానంవేసింది. అసలుమార్కులుచూసి వాడిపై తగినచర్యతీసుకుందామని మార్కులు తెప్పించాను. ఇంగ్లీషులో సున్న. తెలుగులో సున్న. గూర్రిపు ఐదుపేపర్లలోను ఐదుసున్నాలేవచ్చాయి. ఈయేడుసున్నాలు చూచేటప్పటికి నాగుండె బ్రిద్దలైంది. కారణం ఏమైవుంటుందా అని ఆలోచించాను. పరీక్షలలో టీ ఎక్కువతాగ్రిగడంవల్ల బాగా పైత్యంచిందేమో అని నాఅనుమానం. ఎందుకంటె పరీక్షల్లో వ్రాసివచ్చాక ఏంవ్రాసివచ్చానో నాకే తెలిసేదికాదు.

భవం: శవం. నీకష్టం నాగుండెల్లో అండలు అండలు పెకలిస్తోందిరా! ఒక కవిత్వపు ముక్కలో నీ విషయంతేల్చాలంటే "శివం. శవం, భవం, భారం, ఇహం, పరం, శూన్యం," అని వ్రాసేయవచ్చు.

అందరు: ఇదేమిటోర్రియి! మా పేర్లన్నీ యిందులో దూర్చావు?

భవం: అదికాదర్రా దీనిఅర్థం చెబుతా వినండి! శివం, శవం అంటే శివం గారికొడుకైన శవం కు 'భవం భారం' అంటే పరీక్షలో తప్పిపోవడంవల్ల బ్రితుకంతా బరువైపోయింది. 'ఇహం, పరం, శూన్యం' అంటే వాడికి యీకష్టదశలో భూలోకంలోను, పరలోకంలోనూ, అంతటా శూన్యం గోచరిస్తోంది.' అని దీని అర్థం. అదొక్కటేకాదు. మరొక అర్థంచెప్పాలంటే చూడండి! వానికి పరీక్షలో వచ్చినమార్కు

లు ఏడుసున్నాలు. యీ శ్లోకంలో సున్నాలుకూడా ఏడే। యీ విధంగా మనవానిస్థితి యీ శ్లోకంలో అన్వయించేను।

అందరు : ఆహాహా ఏంకవిత్వంరా! ఆనాడు కాళిదాసు చెప్పాడు కవిత। ఈనాడు నీవుచెప్పావు।

శవం : మరినన్ను మా నాన్నదగ్గరికి చేర్చేమార్గం చూడండరా! కొంచెం నన్నుగురించి మానాన్నతో జాలిగా చెప్పండరా!

భవం : మీనాన్న మా సలహాలు వింటాడా ! అందులో మాలాంటి కుర్రాళ్ళ సలహాలు। నాకు నమ్మకంలేదు.

శవం : మరి నాగతి యింతేరా। చూడండరా! బట్టలన్నీ మాసిపోయాయి. వారంరోజులనుంచీ తిండి సరిగాలేదు. మానాన్న ఒక కానీకూడా యివ్వకుండా గెంటేశాడు. రైల్లో టిక్కట్టు కొనకుండా దొంగతనంగా వచ్చేశాను. నా పరిస్థితి చూస్తూంటే మీకు ఏమాత్రం జాలివెయ్యటం లేదరా!

ఇహం : వీడిని చూస్తూంటే నిజంగా జాలివేస్తోందిరా। ఏదైనా ఒక ఉపాయం ఆలోచించరా భవం.

భవం : నాకు జాలిగానే ఉంది. అయితే నిన్ను కొన్ని ప్రశ్నలు వెయ్యాలి.

శవం : వెయ్యరా. అన్నిటికి సరియైన సమాధానాలు యిస్తాను. పరీక్షలో అంటే సరియైన సమాధానాలు యివ్వటం కష్టంకాని, యిక్కడ యివ్వడానికేం?

భవం : మీనాన్నకు కవిత్వం అంటే యిష్టమేనా?

శవం : ఆః ఎప్పుడూ రామాయణ భాగవతాలు చదువుతుంటాడు. కొంచెం కవిత్వం వ్రాసేవాడంటే దగ్గరికి చేరుస్తాడు.

భవం : పాటలంటే యిష్టమేనా ?

శవం : కర్ణాటక సంగీతమంటే యిష్టమే. అప్పుడప్పుడు పల్లె పదాలుకూడా పాడుతుంటాడు.

భవం : జ్యోతిషం పిచ్చి ఏమన్నా ఉందా ?

శవం : కావలసినంత. ఇప్పటిదాకా నేనొక్కణ్ణే కొడుకునిగా. నామీద కోపం వచ్చినప్పుడల్లా నాపీడ వదల్చుకుందామని యింకా పిల్లలు పుడుతారా లేదా అని జాతకం చూపించుకుంటూంటాడు. తనకు పుట్టేకొడుకు గొప్పవాడై సుపుత్రుడవ్వాలని ఆయన కోరిక.

భవం : నీకు పెళ్లి కాలేదుగా యింకా.

శవం : లేదు. కాని ఒక మేనరికం ఉంది. వాళ్లు నాకు యివ్వాలను కుంటున్నారు.

భవం : (యీలలు, చిటికలువేస్తూ). మీనాన్న నీకాళ్ళదగ్గరకు తీసుకవచ్చే పూచి నాది. అలాచేస్తే మాకు బహుమానం ఏంయిస్తావు ?.

శవం : ఒకవేళ పరీక్ష ప్యాసయివుంటే ఎల్లాగ "ఒక టీపార్టీ యివ్వాలిగా మీకందరికీ" దానికి పదిరెట్లు ఒక మంచి టీపార్టీ యిస్తాను.

భవం : మమ్మల్ని ఉత్త టీపార్టీలతో సంతోషపెట్టలేవు. మా కేమన్నా డబ్బు ముట్టచెబుతానంటే........

శవం : ఒరే! నన్ను యింకా ఏడిపించకండరా! కాలేజీలో ఉన్నప్పుడు మీ ఖర్చులన్ని చాలావరకు నే భరించేవాణ్ణి కదుటా! యీ మాత్రం సహాయంచేసి పెట్టండరా.

పరం :- భవం : యింకా వాడిని ఏడిపించకు. అసలే కష్టంలో ఉన్నాడు.

భవం : నీకు తప్పకుండా సహాయం చేస్తాం శవం : ఇంక ఏడ్వడం మానేయి.... (అందరితో) మీరంతాకూడా యీ విషయంలో సాయం చేయాలరాృ !

అందరు : ఓ తప్పకుండా !

భవం : సరే పదండరాృ ! మీకందరికీ ఒక గోసాయిచిట్కా చెబుతాను మనశవం విషయంలో.

## రెండో రంగం

(శివంగారి యిల్లు — వసారా, 2 కుర్చీలు, ఒకబెంచి ఉంటాయి.)

శివం : ఒక్కగాని ఒక్క కొడుకు ! ఎంతో కష్టపడి ఎంతో డబ్బు ఖర్చుచేసి "చదువుకోరా నాయనా అని ముద్దుగా చెబితే వినక పరీక్షలలో ఠపీమని తప్పి ఊరుకున్నాడు. ఇటువంటి వాళ్ళని ఒళ్ల హూనం చేసినాగాని ఇంట్లోంచి గెంటేస్తేగాని బుద్ధిరాదు. నాన్నా అమ్మా బాగా డబ్బిచ్చి, ఎద్దుల్లా మేపుతుంటే, డబ్బు విలువ తెలియక, విరగబడి సినిమాలు, నాటకాలు, టీపార్టీలు, ఎన్నికలు మరిగి, చదువులు తగలబెట్టుకుంటూంటే వాళ్ళని దగ్గరికి చేరదీయమని ఎవడుచెప్పాడు?.... చిన్నప్పటినుంచీ ఎప్పుడూ మందకొడి పీనుగే యీ శవంగాడు ! యిప్పుడు పరీక్ష ఒక్కసారి ప్యాసవమంటే ఎట్లా ప్యాసవుతాడు?.... (విచారంగా) మావాడు పరీక్ష ప్యాసయి, పెద్ద ఉద్యోగంచేసి నాకు కీర్తి తెస్తాడనుకొనేవాణ్ణి....తండ్రికి కీర్తిసంపదలు తెచ్చే సుపుత్రులు యీ

కలికాలంలో గాలిస్తే మాత్రం కనిపిస్తారా !....చిలక్కి చెప్పినట్లు అనేక నీతులు చెప్పాను....చెప్పినవన్ని వింటున్నట్టే ముంగిలా ఉంటాడు!.... చేసేపని మరొకటి ! మరొకటి !....కొంతకాలం బుద్ధి వస్తుంది ! పోనీ వీధులమ్మట !....త్రాష్టపు వెధవ !

(ఇహం జ్యోతిష పండితుడి వేషములో ప్రవేశం)

ఇహం : శివంగారూ !

శివం : ఎవరు ?

ఇహం : నేను పరదేశీయుణ్ణండి. జ్యోతిషంలో బాగా పాండిత్యం ఉందినాకు. మీపక్క ఊరు జమిందార్లు యింటికి సన్మానానికి పిలిస్తే వచ్చాను యీ ప్రాంతాలకు. ఆ జమిందారు చెయ్యి చూసి, ఆయన భవిష్యత్తు గురించి చెబితే, చాలా సంతోషించి, నాకు వెయ్యి నూట పదహారులు బహుమానం చేసారు. మిమ్మల్ని ఆయనబాగా ఎరుగునట ఒక్కసారి మీదర్శనం కూడా చేసుకోమని సెలవిచ్చారు.

శివం : మీరు జ్యోతిష పండితులా ?.... రండిబాబు, లోపలకు రండి....తమ పేరు ?

ఇహం : నాపేరు ఇహం అంటారు.

శివం : ఇదేం పేరండోయ్ !

ఇహం : దీనిలోని అర్థం సూక్ష్మంగా మనవి చేస్తాను. నేను మనిషియొక్క ఇహం అంటే. ఈ లోకంలోని ప్రస్తుత జీవితంగురించి సర్వసంగతులు చెబుతాను. అందుచేత నన్ను ఇహం అంటారు.

శివం : మహాచిత్రమైన పేరు పెట్టుకొన్నారండి....అయితే నా చెయ్యి కూడా చూస్తారేమిటి ? (హా హా హా)

ఇహం : అందుకే కందండి వచ్చాను....(చెయ్యి చూస్తూ) మీరు చాలా అదృష్టవంతులండి !

ఇహం : మీకు రెండోపెళ్ళి అయింది. మీ మొదటి భార్యకు : కొడుకు.

శివం : (సంతోషంతో) నా సంసారమంతా చూచినట్టు చెబుతున్నారే !

ఇహం : ఏమండోయి ! మీ మొదటి భార్య కొడుకు చాలా గొప్పవాడయి పోతాడండి !

శివం : వాడి మొహం ! ఇంటరు పరీక్షలో తప్పిపోయిన వాడు ఏం గొప్పవాడవుతాడండి ! వీడికోసం బోలెడు డబ్బు ఖర్చుచేశాను. పరీక్ష తప్పినందుకు కోపంవచ్చి బయటికి గెంటేశాను కూడా !

ఇహం : "అంతా మన మేలుకొరకే" అన్నట్లు మీరు అతన్ని గెంటివేయడం కూడా అతని మంచికేనండి మీచేతి రేఖలు మీదుగా పరిశీలిస్తే మీకు ఇప్పుడు చాలా ఖ్యాతి వస్తుంది మీ పుత్రుడివల్ల !

శివం : ఖ్యాతి ! ఖ్యాతి వస్తుందండి ! ఇంతకి నాకు వచ్చే ఖ్యాతి వీడివల్ల ఐవుండదు. మీరు కొంచెం పొరబడుతున్నారేమో !.... చెయ్యి జాగ్రత్తగా చూడండి....నాకు యింకో కొడుకు పుట్టి వాడిద్వారా కీర్తి సంపదలు వస్తాయని అందరూ చెబుతున్నారే !

ఇహం : రెండవ భార్యద్వారా మీకు పిల్లలు పుట్టరండి ఇది నిజం. అందుచేత మీ ప్రథమ పుత్రుడి ద్వారానే మీకు కీర్తిసంపదలు వస్తాయి.

శివం : అలాగాండి (ఆశ్చర్యంతో) నాకు యింకా పిల్లలు పుడతారనుకుంటున్నానే !

ఇహం : మీకు ధనధాన్యాదులకు లోటులేదు. జీవితం హాయిగా గడిచిపోతుంది.

శివం : చిత్తం.

ఇహం : మీచేతిలో ప్రత్యేక విషయం ఒక్కటే ఒక్కటి.. మీ పుత్రుడు చాలా గొప్పవాడై పోతాడు. ఒక విధంగా గొప్ప కళారాధకు డని పేరు వస్తుంది.

శివం : కళారాధకుడా ? జడ్జి, కలెక్టరు అనే గొప్ప పదవులలోకి వెడితే గొప్పవాడంటారు కాని, కళారాధకుడయితే గొప్పవాడంటారా ? అయితే కళారాధకులకు కూడా అందరూ పూలదండలు వేసి గొప్పవా డంటారాండి ?

ఇహం : యీ కాలంలో కళారాధకుడిగా ప్రసిద్ధికి రావడమే చాలా గొప్ప. పట్నాల్లో చూడండి. ఎంతమంది ఎన్నిరకాల కళలకు సేవచేస్తూంటారో ?

శివం : అలాగాండి ?

ఇహం : మరే.... అసలు నాజ్యోతిష్య పాండిత్యం ఇంతగొప్ప దని చెప్పకూడదనుకోండి. లంకపురం జమిందారుగారు, పిష్టపురం రాజావారు, తాడిలంక కలెక్టరుగారు అందరూ నన్ను ప్రశంచించారండి !

శివం : కాదుమరి ! మీరు చెప్పేవన్ని సత్యాలని ఋజువు అవు తూంటే గౌరవించరుమరి.

ఇహం : మీ పిల్లవాడు గొప్పవాడయినాక మళ్ళీవచ్చి మిమ్మల్ని కలుసుకుంటాగా ! నేను ఈనాడు చెప్పినమాట ఆనాడు నిజమని మీరు అనకమానరు.

శివం : నా క్కావలసినది అదే! మీ చల్లనిమాట ప్రకారము మా వాడు గొప్పవాడయితే, కోరేదేముంది ఇంకా!

ఇహం : తప్పకుండా నామాటనమ్మండి.... నేను మళ్ళీ మిమ్మల్ని కలుసుకుంటాను. ఏదైనా సన్మానము చేయించి నన్ను పంపిస్తే....

శివం : అయ్యో తప్పకుండా!........ (యింట్లోకి వెళ్ళివచ్చి) ఈ తృణం స్వీకరించి సంతోషించండి యిప్పటికి. మరోసారి మీకు విరివిగా యిచ్చుకుంటా.

ఇహం : తమదయ.

( విష్క్రమణ )

శివం : అయితే నాకింక పిల్లలు పుట్టరన్నమాట. ఉన్న ఒక్క కొడుకును యింటినుంచి గెంటేశానే! పైగా వాడు చాలా గొప్పవాడవుతాట్ట! ఇపుడు పరీక్షలో తప్పడమేమిటి త్వరలో గొప్పవాడవడ మేమిటి!.... అంతా చిత్రంగా వుందే.

(భారం కర్నాటక సంగీతకుని వేషంలో ప్రవేశం)

భా : శివంగారూ.

శి : ఆ! ఆ

భా : నమస్కారం—నాపేరు భారమంటారు.

శి : ( ఆశ్చర్యంగా ) మీపేరు భారమంటారా? ఇదెక్కడి పేరండోయ్.

భా : అవునండి. నేను కర్నాటక సంగీతంలో కీర్తనలు పాడుతుంటె, అవి సరళమై మధుర నాదాలతో భారంగా ఉంటాయంటారు. అందుచేత నాకు భారం అని బిరుదు ఇచ్చారండి.

శి: అయితే....మీరు వచ్చినపని!

భా: ఏమిలేదండి!....నేను ఏదో స్వంత పనిమీద ఈఊరు వచ్చాను. ఈ మధ్య రచయితగా గొప్పపేరు-సంపాదించిన శవం గారి తండ్రిగారు మీరని తెలిసి ఒక్కసారి మీ దర్శనము చేసుకుపోదామని వచ్చాను.

శి: అలాగా....ఏమిటి? శవం గొప్ప రచయిత అయ్యాడంటున్నారు!

భా: మరేనండి! మీ కుమారుడు కొన్ని గీతాలు వ్రాశారు. వాటికి శవగీతాలని పేరు. వాటికి ఈమధ్య గొప్పగొప్ప పండితులు ప్రథమ బహుమాన మిచ్చారండి. ఆ గీతాలలో ఉన్నసారం భగవద్గీతలోకూడ లేదని విమర్శకులంటున్నారు.

శి: అలాగటండి! మావాడు ఉత్తి మందకొడి అనుకొంటున్నాను. ఇంతకాలం!........ పైగా పరీక్షలో తప్పిపోయాడండి.

భా: రామ! రామ! అంతమాట అనకండి. ఆయన చాల గొప్పవారు. అందుకు నిదర్శనం గొప్ప రచయితగా ఆయన బంగారు పతకంకూడ పొందారు......... పరీక్షలకి గొప్పతనానికి ఏమి సంబంధము లేదండి.

శి: అలాగటండి! (ఆనందంతో) మావాడు గొప్ప గ్రంథకర్త అయ్యాడన్నమాట.

భా: అన్నమాట! మరేమనుకున్నారూ! అటువంటి గొప్ప రచయిత తండ్రులైన మీరు చాల ధన్యులు.

శి: ఆ! ఆ........ దానికేం లెండి........ అయితె మావాడి గ్రంథం కాని మీదగ్గర ఉందా!

భా : నేను తీసుకరాలేదు. కావాలంటే ఈసారి తెస్తానులెండి.... అన్నట్టు మీకొడుకుగారు ఈ పుస్తకం చూపించలేదా ?

శివం : చూపించలేదు. ఈ మధ్య పరీక్ష పోయిందని కోపం వచ్చి వాణ్ణి ఇంట్లోనుంచి తరిమివేశానండి

భా : ఎంత తప్పుపని చేశారు. అటువంటి గొప్పవాణ్ణి ఇంట్లో నుంచి గెంటేస్తారా ? ఇంటికి రప్పించండి పాపం!

శి : అదే చేయాలనుకుంటున్నాను.

భా : మరి నాకు సెలవిప్పించండి.

(నిష్క్రమణ)

శివం : చిత్రం........అయితే మా శవంగాడు పెద్ద గ్రంధం వ్రాశాడన్నమాట—వీడు కవిఅని యింతకాలం నాకు తెలియదే.

(వయస్సుమళ్లిన పెద్ద గవర్నమెంట్ ఆఫీసర్‌లాగ వేషం వేసుకొని శూన్యం రాక)

శూన్యం : శివంగారూ !

శివం : ఎవరండి ?

శూ : మీరేనా శివంగారు ?

శి : అవునండి.

శూ : మీతో ఒక చిన్న విషయం సంప్రదించుదామని వచ్చాను.

శి : చెప్పండి.

శూ : నేను పట్టణంలో గవర్నమెంటు ఆఫీసర్‌గా ఒకచోట పనిచేస్తున్నాను. నాకు ఒక కుమార్తె ఉందండి. 15, 16 ఏండ్లు

ంటాయి. కొద్దో గొప్పో చదువుకుంది గూడ. "శవం" అనే అబ్బాయి ౹వాడని తెలిసి మా అమ్మాయిని అతనికి ఇవ్వటానికి ఏమన్నా సావ ాశం ఉందేమో అని ఇలావచ్చాను.

శి : అలాగటండి, కాని మావాడు పరీక్షలో తప్పిపోయాడండి. పరీక్ష ప్యాస్ అయినాకా పెళ్లి చెయ్యాలని ఉంది.

శూ : పరీక్షలకేమండి. యీసారికాకపోతె మరోసారి ప్యాసు ఌచ్చు. మీరు ఈ వివాహానికి అంగీకరిస్తే చాల సంతోషిస్తాను. నాకు ొప్ప రచయిత అల్లుడయ్యాడని గర్విస్తాను.

శి : మావాడు గొప్ప రచయిత అని మీకెలా తెలిసిందండి !

శూన్యం : ఎలా తెలియడ మేమిటండి ! ఏపేపరులో చూసినా అతని బొమ్మే ! అతన్నిగురించి పొగడ్తలూ, వార్తలూను ! అతను ాసిన గీతాలే కనిపిస్తున్నాయి—అంత పేరు ప్రతిష్టలు సంపాదించిన వారిని తెలియకుండ ఎవరుండగలరండి !

శివం : మీరంతా నాకంటె నయమండి ! యిప్పటిదాకా మావాడు రచయిత అనైన తెలియదు నాకు.

శూ : నిండుకుండ తొణుకదు. అందుచేప గొప్పవాళ్ళు వాళ్ళ ఎప్పుడు చెప్పుకోరు. అందుకే మీ కుమారుడు తాను కవిఅని చెప్పి ఉండకపోవచ్చును.

శి : నిజమైన మాట సెలవిచ్చారు.

శూ : అందుచేత యి వివాహం విషయంలో మీ ఉద్దేశ్యం కట్నం విషయంకూడా మాట్లాడుకోవచ్చు.

శి : కట్నానికేంలెండి !....మావాడికి ఒక మేనరికం ఉంది. మేనరికం చేసుకోకపోతె మా చెల్లెలు పీకి చంపేస్తుంది. చాలాకాలం నుంచి పట్టుబడుతోంది. తన పిల్లని మావాడికి చేసుకోమని.

శూ : అయితే మీ అబ్బాయికి మేనరికం ఉన్నదన్నమా మేనరికం ఉంటే మాపిల్లను యిస్తాననడంకూడ భావ్యంకాదు. యిం ఆ పిల్లవాణ్ణి అల్లుడుగా చేసుకొనేవారు చాల అదృష్టవంతులు.

శివం : ఏదో మీరు అభిమానంతో అంటున్నారు కాని....

శూ : ఇది అభిమానంతో కూడిన సంగతి కాదండి. ఇటువం గొప్ప రచయిత అల్లుడైతే ఎవరికైనా గర్వం కదుటండి.

శివం : (హి.హి.హి)....అన్నట్టు తమకు గవర్నమెంటుపని ఉన్నది....ఏమాత్రం జీతంవస్తుందేమిటి.

శూన్యం : 800 రూ.లు.

శివం : (ఆశ్చర్యంగా) 800 రూ.లే ! బాగుందండి.... వ కుర్రాడిగురించి మీలాంటి పెద్దలు మాయింటికి వచ్చారుగాని లేకపో మాకోసం రమ్మంటే మాత్రం వస్తారా !

శూ : మీకుర్రాడి గొప్పతనం ముందు మా పెద్దరికం గొప్పతన. వెలవెలపోతాయి. మీపేరు ఆఫీసు దాటి బైటికి వెళ్ళదు. మీవాడి పే దేశమంత వ్యాపించేసింది.

శివం : చాల సంతోషమైనదండి మిమ్మల్ని కలుసుక్కు .... కాని పరిస్థితులివి.

శూ : దానికేంలెండి మరి శెలవు తీసుకుంటా, మళ్ళీ అం మైతే కలుసుకుందుకు ప్రియత్నం చేస్తానండి.... (నిష్క్రమణ)

శివం : మంచిదండి ఏమిటీ ! మనవాడి గొప్పతనం దేశం అంతా వ్యాపించి పోయిందా !... యింతింత ఉద్యోగస్తులు తమ పిల్ల వివ్వడానికి వస్తున్నారంటె తమాషా.

(ఒక పత్రికా విలేఖరి వేషం వేసుకొని కెమేరాతో పరం ప్రవేశం.)

పరం : (హడావిడిగా) శివంగారు, శివంగారు.

శివం : ఎవరయ్యా అది.

పరం : నేను పత్రికా విలేఖరినండీ.... నాపేరు పరం !

శివం : పరం ! పరం !! ఏంపేరయ్యా.

పరం : అంతేనండి. అంటే నేను మీఇంటివాళ్ళ గొప్పతనం పోగుచేసి పత్రికలకు పంచిపెడతానండి. ఈ లోకంలో మీరు ఎంత గొప్పదనం తెచ్చుకోగలిగితే అంత సుఖం మీరు స్వర్గంలో పొందు తారు. మీ గొప్పతనాన్ని గుర్తించి మీ "పరం"లోని సుఖం పొంద టానికి ఉపయోగించే వాడిని కనుక నన్ను పరం అంటారండి.

శివం : బాగుంది.... అయితే మీరు ఎందుకువచ్చినట్లు యిక్క డికి ?

పరం : మీరు గొప్పవారయ్యారని తెలిసి.

శివం : (ఆశ్చర్యంగా) నేను గొప్పవాణ్ణయ్యేనా !

పరం : అవునండి మీరే ! మీ కొడుకు 'శవం' అనే ఆయన ...లో గొప్ప రచయితగా ప్రసిద్ధిపొందారు, ఆయనదగ్గరకు వెళ్ళి ...న ఫోటోలు రచనలు తీసుకొని పత్రికల కిచ్చాను., మీరు ఆయన ...డ్రిగారవడంవల్ల మీ ఫో...కూడ తీసుకుందామని వచ్చాను.

శివం : నా ఫోటో ఎందుకయ్యా !

పరం : అల్లా అనకండి....మీఫోటో యిచ్చెయ్యాలి.

శివం : నేను ఎప్పుడు ఫోటోలు తీసుకున్న పాపాన పోలేదే !

పరం : మీకెందుకండి ఆ శ్రమ ! నే తీసేస్తాగా మీ ఫోటో ఈ కెమేరాతో !

శివం : తరువాత నా ఫోటో ఏంచేస్తారు.

పరం : పత్రికలలో వేస్తాం "శవం"గారి తండ్రి "శివం" గారని. మీరు అటువంటి కొడుకును కన్నందుకు చాలా ధన్యులయ్యారని.

శివం : (ఉబ్బిపోయి) నిజంగానే....(ఉల్లాసంతో) తీసుకోండి. నాఫోటో తప్పకుండా త్వరగా తీసికోండి.

పరం : సరిగా కూర్చోండి.... ఒక చిరునవ్వు నవ్వండి (ఫోటో తీస్తాడు).) మీ కుమారులు గొప్ప రచయిత అయ్యారుగా. యీ విషయం గురించి మీరు ఏమి చెప్పదలచుకున్నది సెలవియ్యండి. అదికూడ పత్రికలో వెయ్యాలి.

శివం : నేనేం చెప్పగలను. అంతా సంతోషించామని పత్రికలో వ్రాయించండి.

పరం : అలా వ్రాయమండి మేము. మీరు ఏమి చెప్పక పోయినా మీరుచేసిన భావప్రకటన అనుసరించి ఇలా వ్రాస్తాం.

"శవంగారి తండ్రి" అయిన "శివం"గారు తమ కొడుకు గొప్ప రచయిత అయినాడని తెలిసి అమందానంద కందళిత హృదయార విందులైనారని తెలియచేయుటకు మేము చాల సంతోషించు చున్నాము".

శివం : బాగుందండి. చాల బాగుంది. అలా వ్రాయించేయండి.

పరం: ఏమన్నా చెపుతారా.

శివం: ఇంకేం చెప్పమంటారు. కాని (దుఃఖముతో) మావాడు పరీక్షలో తప్పిపోయాడని ఇంట్లోనుంచి గెంటేశాను. ఇంత గొప్పవా డౌతాడని తెలిస్తే అలా చేయకపోదును.

పరం: మీరు ఇంట్లోనుంచి గెంటేశారా అయన్ని! ఎంత తప్పు చేశారు. ఏ తండ్రిఅయిన అటువంటి కొడుకును పొందినందుకు సంతోషిస్తాడు కాని ఇంట్లోనుంచి గెంటేస్తాడా.

శివం: మీకు పుణ్యం ఉంటుంది. కొంపదీసి నేను ఇలా చేశా నని పేపరులో మాత్రం వ్రాయకండి నాకు చాల అప్రతిష్ఠ. పెద్ద కుటుంబీకుణ్ణికూడ.

పరం: ఎంతమాట అన్నారు. ఒకసారి ఎవరైనా గొప్పవాళ్ళయి పోయాక వాళ్ళుచేసే చెడుపనులుగురించి ఎవ్వరైనా వ్రాయమన్నప్పటికీ మేము వ్రాయమండి.

శివం: మీరు చాల మంచివారండి....అయితె మావాడు ఎక్కడ ఉన్నాడండి ఇప్పుడు.

పరం: ఒకచోట ఎట్లా ఉంటాడు. ఈమధ్య దినమంత తిర్గి ఉపన్యాసాలు చాలా ఇస్తున్నట్లు మా తోటి విలేఖర్లు వ్రాస్తున్నారు.

శివం: మావాడు ఉపన్యాసాలుకూడ ఇస్తున్నాడన్నమాట. ఇం కేం ఎంత గొప్పవాడయ్యాడు ...ఇంతకీ దేశంలో నలుమూలలకి వెళ్ళ టానికి డబ్బు ఎక్కడిదండి. నేను ఒక్కపైస ఇవ్వకుండ గెంటేశానే.

పరం: అటువంటి వాళ్ళకు డబ్బు ఎవ్వరైన ఇస్తారు. అయన ప్రజలకు విజ్ఞానమిచ్చి సేవచేస్తున్నారు. అందుచేత ప్రజలే పోషి స్తుంటారు.

శివం : ఆహాహా....ఈ వేళ ఏమిదినమండి మావాడు ఎంత గొప్పవాడైనాడు. నాకు పత్రికలుచూచే అలవాటు లేదండి. అందుచేత నాకీ విషయాలు అట్టై తెలియవు. మా ఫోటో కొంచము జాగ్రత్తగా వేయిస్తారుకదు పత్రికలో.

పరం : తప్పకుండ.

శివం : నాబొమ్మ పడిన పత్రికకూడ నాకు పంపించండి.

పరం : అవశ్యం.........మరి నేను వెళ్లుతానండి. నేను ఇంకా చాలమందిని కలుసుకోవాలి. (నిష్క్రమణ).

శివం : మంచిదిబాబు నేనుకూడ ఒకవిధంగా గొప్పవాణ్ణౌతున్నా నన్నమాట. మా శవంగాడు ఎంత ఉత్తమ పుత్రుడు. ఇట్టె గొప్పవాడై పోయి తండ్రికి కీర్తి తెచ్చాడు. పోని! వెధవ పరీక్ష పోతే పోయింది పాపం వాడు ఎక్కడఉన్నా వెతికి ఇంటికి తీసుకరావాలి.

(పంచ, లాల్చి, శిల్కుకండువ, కళ్లజోడు పెట్టుకుని ఒక కవి లాగా భవం ప్రవేశం.)

భవం : ఏమండోయి శివంగారు.

శివం : ఏమిటి ఈవేళ ఇంతమంది వస్తున్నారు నాకోసం........ ఎవరండీ.

భవం : నన్ను భవం అంటారు.

శివం : ఇదేంపేరయ్యా!.....అందరు ఇటువంటి పేర్లు పెట్టు కుంటున్నారేమిటి.

భవం : ఇది నా కలంపేరు. నా రచనలన్ని ఈ పేరుతో పత్రిక లలో పడుతాయండి.

శివం : మీపేరు చూచి ఎవ్వరు నవ్వరటయ్య !.........నాకు మాత్రం నవ్వువస్తుంది....భవం ఏమిటి.

భవం : నేను భావకవిని. భావకవిఅంటె భావం ప్రధానముగా కవిత్వం చెప్పేవాడు. భావకవి పదములో, కవిపదం వదిలేశాను పురాతన కవులలా ఉండటం ఇష్టంలేక. తరువాత భావం అని మొదట నాపేరు పెట్టుకున్నాను. ఆపైన ఇంకా చిన్నపేరు కవులకు చాల మంచి దని "భవం" అని మార్చేసుకున్నా.

శివం : బాగుందండి ...యింతకి మీరు ఏమి పనిమీద వచ్చారో చెప్పారుకాదు.

భవం : శవంగారు మీ కుమారుడని తెలిసింది. ఆయన ఈమధ్య గొప్ప కవిగా ప్రసిద్ధికెక్కారు. ఆయన జీవితచరిత్ర వ్రాయాలని కుతూహలం కల్గి, ఏమన్నా వివరాలు మీరు చెప్పుతారేమో అని వచ్చాను.

శివం : అ........ఆ మీరు కవులుగదా ఏదైన ఒక గ్రంధము వ్రాసుకోక జీవిత చరిత్ర వ్రాయటమెందుకండి ?

భవం : దానికి ఒక కారణం ఉందిగా. మీరుకాబట్టి చెప్పు తున్నాను. గొప్పవాళ్ళ జీవిత చరిత్రలు తెలుసుకోవాలని చాలమందికి కుతూహలంగా ఉంటుంది. (అందుచేత వారి జీవితచరిత్ర వ్రాస్తె దానిని చాలమంది చదువుతారు) నేను వ్రాసిన జీవితచరిత్ర చదవటం వల్ల ఒకవేళ నేను ఏగ్రంధము వ్రాయలేక పోయినప్పటికిని అందరు నన్ను ఒక రచయితగా పరిగణించి నన్ను చాల గొప్పగా చూస్తారు.

శివం : బాగుంది.........మావాడికి పెద్ద జీవితచరిత్ర ఏముంది ? కుట్టుకుంక 21 ఏండ్లయిన నిండలేదు. ఈ ఊళ్లో పుట్టాడు 21 సం॥

క్రితం. పుట్టగానే ఏదో చాల రోగంతో పుట్టాడు. చాలాకాలందాక శ్వాస కనిపించేదికాదు. వాడు బ్రతికిఉన్నాడో చనిపోయినాడో కూడ తెలుసుకో లేక పోయే వాళ్ళము. పైకిమాత్రం పూర్తిగా శవంలా కనిపించేవాడు. (ఏలినాడి శనిలో పుట్టడంవలన వాడిని రెండేళ్ళదాక శని పీక్కు తిన్నది.) రెండేళ్లు శవంలా ఉంపి రోగంతో బాధపడ్డాడు. ఆ రెండేళ్లు అందరు వాణ్ణి శవంఅని పిలిచేవారు. తర్వాతకూడ అదేపేరు వాడుకలోకి వచ్చేసింది. అందుచేత యింకా ఖర్చులుకూడ ఎందుకని నామకర్ణమే చేయలేదు మావాడికి.

భవం: ఆయనపేరుకే పెద్ద చరిత్ర ఉందన్నమాట.

శివం: తరువాత ఏదో చదువుకొని పెద్దవాడై ఇంతవాడయ్యాడు. వాడు ఎప్పుడు ఎక్కడ చదివింది మొదలైన విషయాలు తేదీలతో జ్ఞాపకం చేసుకొని ఈసారి చెప్పుతాలెండి.

భవం: అయితే నేను మళ్లీ రావాలన్నమాట.

శివం: లేకపోయినను మీ చిరునామ ఇస్తే పోస్టులో పంపుతా.... మీరు మావాడి గ్రంధముగాని చూసారా..

భవం: మీ అబ్బాయిగారి దగ్గరనుంచి శవగీతాల కాపీ ఒకటి తీసుకున్నాను. ఆ పుస్తకము ఇదిగో నావగ్గరే ఉంది (పుస్తకం ఇచ్చి) దీన్నిగురించి విమర్శకూడ వ్రాద్దామను కుంటున్నాను. రచయితపేరు శవం కనుక ఈ పుస్తకానికి "శవగీతాలు" అని పేరు పెట్టి ఉంటారు.

శివం: (పుస్తకంవంక చూచి) నాకు సర్గ్గా అక్షరాలు కనిపించ టంలేదు రెండు గీతాలు చదివి వినిపిద్దురు.

భవం పాట : (గాలిలో గాలి.........తంత్ర్యులను)

| | |
|---|---|
| గొప్పతనమంటె | ఆడదాని అందంలా |
| చక్కటి దప్పళం | ఆకాశంలో వెలుగుల్లా |
| మానవులంతా | అనంత ప్రకృతిల |
| ఆశలు కలిపి | ఆకర్షించును ఆకర్షించును |
| మర్దించి గుటకలు వేస్తారు। | గొప్పతనం, గొప్పతనం. |

విశ్వవ్యాప్తమైన వాయువుగురించి కనిపించని ఆనందమైనటు వంటి గొప్పతనంగురించి యింకా మొదలైన వాటిని గురించి రచించాడు మీ అబ్బాయి. అయితే ఈ పుస్తకము మీకు చూపించలేదా ?

శివం : ఆ యోగము లేదునాయనా నాకు. పరీక్ష తప్పిపోయా డని ఏదో కోపంవచ్చి ఇంట్లోనుంచి గెంటేశాను వాణ్ణి. మావాడు ఇంత గొప్పవాడవుతాడని నాకేంతెలుసు.

భవం : అయ్యయ్యో ఎంత తప్పుపని చేశారు.

శివం : ఇప్పుడు చాల విచారిస్తున్నాను. మావాడి జాడ నీకేమైన తెలుసునాబాబు.

భవం : తెలియకేమండి గొప్ప రచయితలంతా కలిసి పట్ణంలో "విజ్ఞాన విజృంభణ సమాజం" అని ఒకటి తెరిచారు. దానికి మీ అబ్బా యిని అధ్యక్షుడుగా ఎన్నుకున్నారు. అది చాల గొప్పపదవి. ఎంతో గొప్ప రచయిత అయితేకాని ఆ పదవి అలంకరించటము కష్టము.

శివం : అలాగాండి. మరి మావాడికి జీతం ఏమైనా ఇస్తారా.

భవం : దానికి జీతం ఏమి ఉండదండి. అయినా డబ్బు కావా లంటే లక్షలాది రూపాయలు.ప్రజలే ఇస్తారు అటువంటి గొప్పవాళ్ళకు

ఇటువంటివన్ని ప్రజాసేవ చేయు సంఘాలు. గాంధీగారికి ఏ జీతం ఇచ్చారని ప్రజాసేవ చేశారు ? అలాగే మీ అబ్బాయికూడ.

శివం : అలాగాండి. బాగుంది కాని ఒక్క సందేహముందండి. పరీక్ష పోయినవాళ్ళు గొప్పవాళ్ళవుతారంటారా.

భవం : అయ్యో ! ఎందుకపరండి అసలు పరీక్షలకు గొప్పతనానికి సంబంధము ఏముందండి. నిజమైన గొప్పవాళ్ళు ఏ పరీక్షలు ప్యాసుకాలేదండి. నన్నయ తిక్కనాదులు పరీక్షలు ప్యాస్ అయి మహాభారతం వ్రాశారు. పోతన ఏపరీక్ష ప్యాస్ అయి దేవుణ్ణి చూచాడు! వేదవ్యాసుడు ఏపరీక్ష ప్యాసుఅయి అంత మహాతపస్సు సంపాదించాడు. భరతుడు ఏపరీక్ష ప్యాసుఅయి అంత గొప్ప చక్రవర్తి అయ్యాడు! బుద్ధుడు ఏపరీక్ష ప్యాస్అయి అంత గొప్ప మతప్రవక్త అయ్యాడు!.... అందుచేత ఈ college పరీక్షలకు గొప్పతనానికి ఏమి సంబంధము లేదండి. పుట్టగానే "ఫలానావాడు గొప్పవాడు" అని బ్రహ్మ వ్రాసేస్తాడు.

శివం : మీరు బాగా చదువుకున్నవారు సుమండి !

భవం : కాదుటండి మరి !

శివం : మీకు ఎంతో కృతజ్ఞుణ్ణయి వుంటాను. మావాడిదగ్గరకు నన్ను తీసుకవెళ్ళండి....వాణ్ణి ఎందుకు ఇంట్లోనుంచి వెళ్ళగొట్టేశానా అని పశ్చాత్తాప పడుతున్నాను.

భవం : మీరు విచారించకండి నాతోవస్తె మీఅబ్బాయిని మీరు చూడవచ్చు.

శివం : పదండి.

# మూడవ రంగం

(విజ్ఞాన విజృంభణ సమాజము అని బోర్డు, చక్కటి బిల్ల (శివం, భవంరాక) సూటులో ఉంటాడు, కోట్ కి ఒక బంగారు పతకం)

భవం : రండి ! మీఅబ్బాయి ఇక్కడున్నారు !

శివం : (ఆనంద దుఃఖాలతో) ఒరె శవం ! నాయనా ! ఎంత తప్పు చేశానురా ! ఇంత గొప్పవాడై పోతావని తెలిస్తే ఇంట్లోనుంచి వెళ్ళగొట్టనిచ్చేవాణ్ణా ! (అని కౌగలించుకుంటాడు).

శవం : పోనీలెండి నాన్నగారు ! అయిపోయిందేదో అయిపో యింది.

శివం : ఈ office అంతా నీదేరా ! ఇంతచక్కని సూటు ఎక్కడిదిరా ! కుట్టించుకున్నావా !

శవం : నేను కుట్టించుకొనే దేమిటి ? ప్రజలే వద్దంటూంటే బహుమతి ఇచ్చారు.

శివం : చాలా సంతోషం............ భవంగారు ! మీ సహాయం మరచిపోలేనండి.........మళ్ళీ మావాడిదగ్గరకి నన్ను చేర్చారు.

శవం : నేను ఎప్పుడూ మీవాణ్ణే నాన్నగారు, ఒక్కళ్ళు మనలని విడదీయలేరు ? చేర్చలేరు.

శివం : నాకు తెలియదూ ! నేనంటే నీకెప్పుడు అభిమానమే. నేనే తెలివితక్కువగా నిన్ను గెంటేశాను ఇంట్లోనుంచి !

శవం : దానికి విచారించకండి నాన్నగారు !

భవం : ఏమండోయ్ ? మీవాడి కోటుమీద బంగారు పతకం చూశారా ! అది ఆయన శవగీతాలు రాసినందుకు బహుమతి !

శివం : (సంతోషంతో) ఆహాహా : ఏంబాగుంది ! బలేబాగు తళతళ మెరుస్తూంది ఈ పతకం, తండ్రికి కీర్తి సంపదలు తెచ్చావురా నాయనా ! పోతే పోయింది వెధవ పరీక్ష ! మళ్లీ కూర్చోవచ్చు ! మా శవం ఆహాహా ఎంతమంచివాడు ! ఎంత గొప్పవాడు ! సుపుత్రుడు అంటే వీడె ?

(ఇహం, పరం, భవం, శూన్యం రాక)

శివం : ఏమిటి మీరంతా ఇలావచ్చారు ?

ఇహం : శవంగార్కి జ్యోతిషం చెప్పుదామని వచ్చానండి.

భవం : వారిని కలుసుకొని వారి గీతాలు స్వయముగా విందామని వచ్చాను.

పరం : నాకు అప్పుడప్పుడు ఈయన్ని కలుసుకోవలసినపని ఉంటుందిలెండి.

శూ : మీ అబ్బాయినికూడ స్వయంగా కలుసుకొని వివాహ విషయం ప్రస్తావిద్దామని వచ్చాను.

శివం : అయితే శవం ! వీరి అమ్మాయిని నీకిస్తారట చేసుకుంటావేమిటి ? ఆయన 800 రూ. ఉద్యోగస్థుడురా !

శవం : ఇదెందుకు నాన్నగారు ఇప్పుడు. అత్తయ్య యేమన్నా అనుకోదు ?

శివం : బుద్ధిమంతుడంటే ఇలా ఉండాలి ! విన్నారా బాబు !

శూన్యం : సరే మీఇష్టం.

శివం : రా నాయనా! ఇంటికిపోయి కొన్నాళ్ళు అక్కడ ఉంటి నీవిషయాలు చూసుకుందువుగాని!

భవం : (ఫోనులో) శవంగారు!.... ఇప్పుడు చాలా పనిమీద ్నరు. తర్వాత మాట్లాడండి. ఏమండోయ్!....చూచారా! మీ ్బయితో మాట్లాడటానికి నిత్యము జనం ఎలా హడావుడి చేస్తుం ారో!

శివం : ఆహాహా మరి మావాగ్ఁటే ఏమనుకున్నారు!....పోదాం రారా! శవం!

శవం : ఏమోయి! భవం! నేను మాఊరు వెళ్ళి రెండురోజుల్లో ొస్తాను నా ఆఫీసు చూస్తూండు ఈలోపల.

భవం : తప్పకుండా (శవం, శివం నిష్క్రమణ).

ఇహం : ఏంరా భవం! నీ గీతాల పుస్తకానికి వాడిని గ్రంథ కర్తగా చేశావేమిటి! ఏమదృష్టవంతుడురా శవం! ఇట్టే కవిఅయి ఊరుకున్నాడు.

శూన్యం : ఆ బంగారు పతకం, ఆ సూటు పోయినట్టేనా ఇంక.

భవం : వాటి ఖరీదు ఇచ్చేస్తానని చెప్పాడుగా.

పరం : మనకి కాలేజిలో పెట్టిన మారుపేర్లు ఇలా సరిఅయిన ఉపయోగానికి వస్తాయని ఎవరనుకున్నారు.

భారం : దానికేంగాని మనకి టీపార్టీ ఇవ్వకుండా పోయాడే ఈ శవంగాడు.

భవం : మళ్ళీ వచ్చాక వడ్డీతోసహా పుచ్చుకుందాం.

పరం : ఇహంగారు, భవంగారు, శూన్యంగారు....మీరు చేసి ఘనకార్యాలకు మీ ఫోటోలు తీసుకొని పత్రికలో వేయిస్తాను. ఫోటో లివ్వండి. (అంతా నిలుచుంటారు ఒక వరుసలో) చిరునవ్వు నవ్వండి ఫోటో తీస్తాడు కామెరాతో. పత్రికల్లో ఏమని వ్రాయించమన్నారు. (నోటుబుక్కు pencil పుచ్చుకొని నిలబడుతాడు). చెప్పండి.

భవం : పరంగాణ్ణి ఇంకా ఇటువంటి వెర్రిహేళనలు కట్టిపెట్ట మన్నామని పత్రికలో వ్రాయించండి.

( నవ్వులు )



# మీ అభిమాన రచయిత

పోతుకూచి సాంబశివరావు

## ఉత్తమ గ్రంథాలు

| | వెల. |
|---|---|
| 1. ఇదీ తంతు : వ్యంగ్యహాస్యనాటిక: | 0-75 N·P |
| 2. ఉదయ కిరణాలు : నవల: | 3-00 |
| 3. క్రొత్తవిలువల బ్రతుకు (కథలు) | 1-50 |
| 4. సాంబశివరావు కథలు: | 1-50 |
| 5. ఏడురోజుల మజిలీ (నవల) | 3-00 |
| 5. ప్రతి ధ్వనులు (రేడియోనాటికలు) | 1-25 |

## త్వరలో వెలువడు ప్రచురణలు

1. అన్వేషణ (నవల) (తెలుగు భాషాసమితిచే ప్రథమ బహుమతి పొందినది)
2. బ్రతుకుల పతనం (కథలు)
3. ఏడురోజుల మజిలీ (హిందీ అనువాదం).
4. దొంగ - దొర (హిందీ అనువాదం)
5. శేఖరం కథలు.

BC



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B105 |
| పుస్తకం పేరు | దొర ఏడు మన్నలు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | Ci, BCi |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Vedavathi. |
| పేజీలు విడదీసినది | Vedavathi. |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good. |